ఓం

శ్రీ గురుభ్యోనమః

# నిఖిల వేదాంతార్థ నివహము

(ద్వాదశ విధ బోధలు)



ఈ గ్రంధ పునర్ముద్రణదాతలు :



## శ్రీ మహమ్మద్ గాలిబ్
## శ్రీమతి నవ్యాబీ



శ్రీ గురుభ్యోనమః

**ఈ గ్రంథ పంచమ పునర్ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన**

**శ్రీ మహమ్మద్ గాలిబ్, నవ్యాబీ దంపతుల సంగ్రహ చరిత్ర.**

గుంటూరు జిల్లా పెదకాకాని మండలం, వెనిగండ్ల గ్రామ కాపురస్తులు మహమ్మద్ గాలిబ్ 1-8-1949వ సం॥లో జన్మించిరి. S.S.L.C వరకు విద్యనభ్యసించిరి. మల్టీ పర్పస్ హెల్త్ సూపర్‌వైజర్‌గా ఉద్యోగమును నిర్వహించిరి. వీరికి 4గురు సోదరులు ఇద్దరు సోదరీమణులు కలరు. యుక్త వయస్సు రాగానే అదే గ్రామ నివాసి షేక్ నవ్యాబీని 27-5-1973లో వివాహము చేసుకొనిరి. వీరికి రహమ్ తున్నీసా, మెహరున్నీసా, ఫాతిమున్నీసా అను ముగ్గురు కుమార్తెలు కలిగిరి. పూర్వ జన్మ సుకృతము వలన శ్రీ శివరామదీక్షిత పీఠాధ్యక్షులైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులు అదే గ్రామనివాసి అయిన పూర్ణానంద శ్రీ కొండమడుగుల వెంకటరెడ్డి గారి వద్ద మంత్ర దీక్షను తీసుకొని ఈ సాంప్రదాయమునందు కృషి చేయసాగిరి. వీరి ఉద్యోగమంతా గుంటూరు పట్టణము నందే జరిగినది. యుక్త వయసులోనే ప్రారబ్ధ కర్మ పూర్తయి 27-12-2001లో సుమారు 52సం॥లు వయసులోనే హృద్రోగము వల్ల మరణించిరి. పెద్ద కుమార్తె రహమ్ తున్నీసా హౌసింగ్ కార్పోరేషన్‌లో ఎల్.డి.సి.గా ఉద్యోగం నిర్వహించుచున్నారు. 2-2-97లో షేక్ మొహిద్దీన్ గారితో వివాహము జరిగినది. వీరికి ఇరువులు కుమారులు. రెండవ కుమార్తె మెహరున్నీసా యు.డి.సి. గా తెనాలి గవర్నమెంటు హౌస్కూల్‌లో ఉద్యోగం చేయుచున్నారు. 26-10-2002లో షేక్ మన్వర్‌పాషాతో వివాహము జరిగినది. వీరికి ఇరువులు కుమార్తెలు. మూడవ కుమార్తె ఫాతిమున్నీసా పోస్ట్ గ్రాడ్యుయేషన్ వరకు చదివి స్కూల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం చేస్తున్నారు. ఈమెకు వివాహం కావలసి యున్నది.

మహమ్మద్ గాలిబ్‌గారు చిన్న వయసులోనే మరణించినా వీరి భార్య నవ్యాబీ ముగ్గురు ఆడపిల్లలను చక్కగా విద్యావంతుల్ని చేసినారు. ఉద్యోగముల యందు ప్రవేశింపచేసి సంసారమును ఎంతో బాధ్యతతో నిర్వహించిరి. ఈ గ్రామములోనే శివరామదీక్షితీ పీఠమునకు అధ్యక్షులైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులు పరిపూర్ణ దర్శనాచార్య శ్రీ సదానంద ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి ప్రియ శిష్యులైన విజ్ఞానానంద శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి దంపతుల శిష్యమండలి ఒకటి కలదు. అందు పమిడి పూల మల్లేశ్వరమ్మ దంపతుల సహవాసము ఈ కుటుంబం వారిపై హెచ్చుగా పనిచేసి, జన్మ సార్ధకతకు ఆధ్యాత్మిక జీవిత అవసరాన్ని గుర్తించి పై దంపతుల ప్రేరణతో తన ముగ్గురు కుమార్తెలతో సహ 15-2-2004 వ సం॥లో మంత్ర దీక్ష తీసుకొని సాంప్రదాయమున కనుగుణ్యముగా అనుష్టానము, ఆచరణ, విచారణల యందు శ్రద్ధగా కృషి చేస్తూ జన్మ సాఫల్యమును చేసుకొన్నామని పరమ సంతృప్తితో ఆదర్శవంతముగా జీవితము గడుపుచూ, గురు ధర్మము సమాజములో విరివిగా ప్రచారము జరుగుట కొరకై ఈ గ్రంధ ముద్రణకు వలయు ఆర్ధిక సంపత్తిని అందించి ధన్యులైరి. వీరిలో తృతీయ కుమార్తె ఫాతీమున్నీసా యుక్త వయసులోనే క్రమంగా కృషి చేయుచున్నారు. శ్రీ గురుమూర్తి అనుగ్రహము సర్వదా వీరి యందు ప్రసరించి సమస్త సుఖశాంతులు కల్గుగాక.

ఇట్లు

**పమిడిపూల మల్లేశ్వరి**

ఓం

శ్రీ గురుభ్యోనమః

# నిఖిల వేదాంతార్థ నివహము

(ద్వాదశ విధ బోధలు)



రచన :

## శ్రీమత్ భాగవత కృష్ణ దేశికేంద్రులు

వ్యాఖ్యాత :

## శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

అనుబంధగ్రంథము :

## రాజయోగి తత్వసుధ

చతుర్థ ముద్రణ



వెల Rs.30:00

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంధ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృత మొనగించినారు. వారి శిష్యశిష్యులు వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేగాక గురుధర్మ నిర్వహణలో శ్రీ రామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారము చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ"ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటు చేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించుచున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచలన్నియు వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజా పుష్పములుగా సమర్పింపబడియున్నది. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురు పరమాత్మను ప్రార్థించుచున్నాము.

ఇట్లు
భక్తమండలి తరపున

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ఓం

శ్రీ గురుభ్యోనమః

శ్రీ మద్భాగవత కృష్ణదేశి కేంద్రుల వారిచేరచింప బడిన నిఖిలవేదాంతార్థ నివహము. టీకా తాత్పర్య విశేష వివరణ సహితం

శ్రీమదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యుడగు పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద, శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావుగారిచే రచింపబడిన టీకా తాత్పర్య విశేష వివరణ సహితం

# తొలిపలుకు

శ్రీమద్భాగవత శ్రీ కృష్ణదేశికేంద్రులవారు నిఖిల వేదాంతార్థ నివహము (ద్వాదశవిధబోదలు) అను పేరుతో రచించిన పద్యముల సంపుటియే ఈ గ్రంథము వేదాంతమునకు సంబంధించిన ముఖ్య విషయములన్నియు క్లుప్తముగా పద్యములందు పొందు పరుచబడి యున్నవి. కనుక గ్రంథనామ మెంతయొ సార్థకమైయున్నది. కాని వివరణ బహు స్వల్పముగా నున్నందున యెల్లరకూ యీ రచన యందలి గంభీర భావములు తేట తెల్లముగా తెలియరాకున్నవి. కనుక

ఈ పద్యములందలి కఠిన పదములకు టీకయు విశేష వివరణమున్ను చేసి తాత్పర్యము వ్రాయుట ముముక్షుజనలోకమున కెంతయో సహాయకారిగా నుండునని పీఠాధిపతులైన శ్రీమదచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి యాజ్ఞను శిరసావహించి యీటీకాతాత్పర్యములు వ్రాయడమైనది.

విశేష వివరణములను మరీ విపులపర్చి విమర్శనాత్మకముగ వ్యాఖ్యానించి బూనినచో అది కేవలమొక స్వతంత్రగ్రంధ రచన కాగలదు. కనుక యందలి విశేషములను తగుమాత్రముగా సూచించటమే యీ రచనోద్దేశము. ఎల్లరకు సుబోధకమగునటుల సాధ్యమైనంత సులభశైలిలోనే మూల గ్రంధము నందలి ముఖ్య విషయములు పాఠకలోకమునకు అందించడమైనది.

ఇట్లు

బుధజన విధేయుడు

**శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు**

బి.యే; బి.యల్;

వ్యాఖ్యానకర్త

నర్సాపురం



# నిఖిల వేదాంతార్ధనివహము

## విశ్వోద్భవస్థితి ప్రళయాష్టకం

1. సీ॥ జగదుద్భవస్థితి సంహారములు మీకు
తెలిపెద వినరయ్య తెల్లముగను
జనులార సాధన సంపద్విశిష్టుడౌ
సచ్ఛిష్యవరుడొక సద్గురునకు
జేయవలసిన నాల్గు శుశ్రూష లొనరింపు
చుండివాడడిగె బ్రహ్మాండ మెట్లు
జన్మించి వర్ధిల్లి జన్మస్థలమునకు
జేరునో యిది తెలియ జెప్పమనుచు

గీ॥ వినయమున మ్రొక్కిలేవక వేడుచున్న
జూచి కరుణించి భక్తికి చోద్యమంది
లెమ్మిదెల్పెదనని వాని లేవనెత్తి
త్రివిధదీక్షలు గావించి దెలుపదొడగె॥

**కఠిన పదములటీక :**

(1) జనులార = పుట్టుచావులు పొందే సమాన ధర్మముగలమానవులారా!

(2) జగదుద్భవస్థితి సంహారములు = ఈశ్వరుడు, జీవులు, జగత్తు, అనుమూటీ యొక్క పుట్టుట, పెరుగుట, నశించుట.

(3) సాధన సంపద్విశిష్టుడు = సాధనల యందు జయము సాధించి పొందదగిన సిద్ధిని పొందినవాడు.

(4) నాల్గుశుశ్రూషలు = (a) స్థాన శుశ్రూష = గురువు కాపురముండు స్థానమెంత హీనమైనదిగానుండినను ఆ స్థానమందే నివసించి గురునకు పరిచర్య లొనర్చుచూ భోదవినుట.

(b) అంగశుశ్రూష = శిష్యుడు త్రికరణ శుద్ధిగా గురువాక్యమున కనుకూలముగు రీతినే మనసునందు తలంపుగల్గియుండుట వాక్కుచే వానిని గురించియే వచింపుచుండుట. మనోవాక్కుల కనుగుణ్యముగానే శరీరముచే వర్తించు చుండుట.

(c) ఆత్మశుశ్రూష = భుక్తి ముక్తి క్రియ లన్నింటిలో గురునికి మిక్కిలి సంతోషము గలుగునట్లు శిష్యుడు ప్రవర్తించుచుండుట.

(d) భావ శుశ్రూష = గురుడే పరిపూర్ణ భావమును బోధించెనో ఆ భావమునకు విరుద్ధమైన విధముగా వర్తించక గురుడు చూపిన బాటయందే నడుచుట.

(5) బ్రహ్మాండము = వ్యష్టియగు తన మనః ప్రాణ శరీరములు గాక మిగతా విశ్వమంతయు.

(6) త్రివిధ దీక్షలు : (a) అణవ దీక్ష = గురుడు మంత్రోపదేశముచేసి అనుష్ఠాన విదులనుబోదించగా అప్రకారము పట్టువిడువక శిష్యుడనుష్ఠాదికమును నిర్వర్తించుట.

(b) శాంభవదీక్ష = పరిపూర్ణ బోధమారూఢమగుటకైపఠించి విచారణ చేయుమని గురుడాదేశించిన సద్గ్రంధస్థ విషయములను శిష్యుడు విమర్శించుట.

(c) శాక్తదీక్ష : పైన ఉదహరించిన రెందు దీక్షల యందునూగూడ అసమర్ధుడగు సచ్ఛిష్యుని యెడల పరిపూర్ణాను గ్రహముచే తన ఆత్మ శక్తిని శక్తిపాతము చేత గురుడా శిష్యుని యందు ప్రవేశింపజేయుట, ఐతే ఆ శిష్యుడు సర్వార్పణ బుద్ధితో గురునికి శరణాగతిచేసి సంపూర్ణ ప్రపత్తి లక్షణము బూని మహాభక్తుడై యున్నపుడేగాని గురువు శక్తిపాతము చేయడు. కనుక శిష్యుని ప్రపత్తి లక్షణము యీ దీక్షలో ప్రధానమైనది. (1) దృగ్దీక్ష (2) స్పర్శదీక్ష (3) వాక్దీక్ష అనునవే త్రివిధ దీక్షలని కొందరందురు.

వీని వివరణ యెట్లనగా

(1) దృగ్దీక్ష = చేప నీటిలో గ్రుడ్లను పెట్టి వానినే చూచుచూ వాని చుట్టూ ప్రదక్షణముగా తిరుగు చుండును. అకరుణామృత దృష్టి ప్రసారముచే గ్రుడ్లు

యెదిగి పిల్లలగును. అట్లే కరుణామృత దృష్టిచే శిష్యుని గురువు కనుగొను చూ శ్రేయోభివృద్ధి కోరుటయే దృగ్దీక్ష. యిదియే మీా నాంద న్యాయము.

(2) స్పర్శదీక్ష = కోడిగ్రుడ్లను పెట్టి తన శరీరోష్ణతచే అగ్రుడ్లను పొదిగి పిల్లలను చేయును. అట్లే గురువు శిష్యునికి హస్తమస్తక సంయోగము చేసి తద్వారా తన శక్తిని హస్తమస్తక సంయోగరిత్యా శిష్యుని ప్రసాదించుటయు స్పర్శదీక్ష యిది కుక్కుటాండన్యాయము.

(3) వాగ్దీక్ష = తుమ్మెద పురుగును దెచ్చి తొండముతో పొడిచి మూర్ఛనొందించి ఆ పురుగు శరీరముపైన గ్రుడ్లుపెట్టి వాని చుట్టును ఝుంకార నాదముచేయుచూ తిరుగుచుండును. యిట్లే చేయగా చేయగా గ్రుడ్లు యొదిగి తల్లిరూపముతో పిల్లలై ఎగిరిపోవును. అదే రీతిగా గురువు శిష్యునికి మంత్రోపదేశము చేసి తన వాగామృతముచే అనగా ప్రభోదచే శిష్యుని పోషించి శిష్యుని తనంతటి వానిగా నొనర్చును. యిది భ్రమర కీటక న్యాయమనబడును. ఐతే ముందుగా చెప్పబడిన దీక్షలు అనగా అణవ దీక్ష, శాంభవ దీక్ష, శాక్తదీక్ష అనగా (1) అనుష్ఠానము (2) విచారణ (3) ప్రపత్తి లేక సర్వార్పణం అనునవి శిష్యుని కుండవలసినవి. దృగ్దీక్ష, స్పర్శదీక్ష, వాగ్దీక్ష అనునవి గురువు పూనవలసినవి. యిందు శిష్యుని కార్యమేదిలేదు అని గ్రహించవలెను. యీ రెండు రకముల దీక్షలూ గురు శిష్యుల కుభయులకూ నిర్ణయించబడినవి. అందుకే గ్రంధకర్త కృష్ణదాసుగారు తమకందార్ధములలో "కం॥ హృదయగ్రంధి విడుటకై సదయత యీబోదెల్పజనదాగురుడై - వదలక తన చిత్తములో గురుపద యుగళము దలపవలదే భక్తుడైనపుడూ; భ్రాంతి రహితాసక్తుడైనపుడూ; కుదరదు యివి రెండు గురుశిష్యులకు లేక కదలికే లేనట్టి ఘనబోదోక్తస్థితి" అని శెలవిచ్చి యున్నారు.

తాత్పర్యము

విశ్వమెట్లు పుట్టిపెరిగి నశించు చున్నదో చక్కగా తెలియపరుతును. వినుడు. సాధనలయందు జయము సాధించిన యోగ్యుడగు శిష్యుడొకడు సద్గురువు నాశ్రయించి నాల్గు శుశ్రూషలు చేసి గురుకృపకు పాత్రుడై ఎంతో వినయముగా మ్రొక్కి ఈ బ్రహ్మాండ మెట్లు పుట్టినది? ఎట్లు నిలబడి యున్నది? తుదకెట్లు లేక పోవుచున్నది? అని ప్రశ్నించగా కరుణామయుడగు గురుమూర్తి పాదములపై

వ్రాలి లేవక యున్న శిష్యుని లేవనెత్తి త్రివిధ దీక్షలిచ్చి ఈ క్రింది విధముగా బోధించెను.

2. సీ॥ వినుము నీవడిగిన విశ్వోద్భవ స్థితి
ప్రళయముల్ వినిపింతు బ్రహ్మమందు
బ్రహ్మాహమస్మ్యను పలుకులేనిదెగల్గి
పురుష ప్రకృతులయ్యు పుట్టజేసి
ముగ్గురు మూర్తుల వారి మూడు లోకములను
పుట్టించి రక్షించి పొలయ జేయు
చుందు రీలోకములందాత్మ కర్మ
వశంబున పిండముల్ జననమగు

తే॥గీ॥ జనును కర్మక్షయంబైన; మును గగనము
వహ్ని పవన జలావనుల్ వరుసబెట్టి
స్వాంశములతోడనేగు స్వస్థానములకు
వాటి సంబంధులేడ్తురు వాటికొరకు

## కఠిన పదములకుటీక :

(1) బ్రహ్మాహమస్మి = నేనే బ్రహ్మమునై యున్నాను
(2) పురుషప్రకృతులు = బ్రహ్మము, దాని స్వాభావిక శక్తి
(3) ముగ్గురుమూర్తులు = సృష్టికర్తయగు బ్రహ్మ పోషణకర్తయగు విష్ణువు, లయకర్తయగు రుద్రుడు
(4) వారి మూడు లోకములు = బ్రహ్మకు సత్యలోకము, విష్ణువునకు వైకుంఠలోకము, రుద్రునకు కైలాసలోకము.
(5) పిండములు : పిండాడములు = వ్యష్టిజీవోపాదులు
(6) ఆత్మకర్మవశంబున = పూర్వమందు చేసిన తన సుకృత దుష్కృతముల యొక్క శుభాశుభఫలముల వలన.

(7) కర్మక్షయంబైన = కర్మనాశనముకాగా (కర్మ అగామి సంచిత ప్రారబ్ధములను మూడు రూపములగా యున్నది. అనుభవించుట చేత ప్రారబ్ధము ఆత్మజ్ఞానము చేత నంచితమును, కర్తృత్వత్యాగపూర్వకమగు కర్మానుష్టానముచే ఆగామియున్ను లేకపోగా అని అర్థము.

(8) జనును = జన్మరాహిత్యము పొందును

(9) మును = పూర్వపు

(10) గగనము = ఆకాశము

(11) వహ్ని = పవన జలావనుల్ = అగ్ని, వాయువు, జలము, భూమి అను మిగతా భూతములు.

(12) స్వాంశములతోడనేగు స్వస్థానములకు = స్థూల శరీరముల యందలి తమతమ పంచభూతాంశములతో సహా పంచమహాభూతములలో చేరిపోవును.

తాత్పర్యము : విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయముల చెప్పెద నాలకింపుము: "నేనే బ్రహ్మము" అనే వృత్తి (అహంస్పురణ) నిజముగా లేనిదేవైననూ తనకు తానుగా తోచినది, ఆ అహమనే వృత్తియే పురుష ప్రకృతులుగా నై త్రిమూర్తులను వారిలోకములనూ సృష్టించి స్థితిలయములను చేయుచున్నది. జీవులు తమతమ పూర్వకర్మాను సారముగా యుత్పత్తి చెందుచూ పూర్తిగా (నిశ్శేషముగా) కర్మత్రయము నశించినచో జన్మ రాహిత్యములను బొందుదురు. పంచ భూతాంశగుణములచే నేర్పడిన వారి స్థూలశరీరములు పంచమహాభూతములలో చేరిపోవును. ఆస్థూల శరీర సంబంధులగు బంధువులు, ఆశరీరముల గూర్చి యేడ్చుచుందురు.

3. సీ॥ శ్వాసలారైనను జరుగునొక్క విఘడియ
అవి అరుపదులైన నగును ఘడియ
అవి రెండు ముప్పదులైన నహోరాత్ర
మే; నది మూడు నూర్లరువ దరుగ
నగువత్సరము, మూడు నలుబది లక్షల

యిరువది వేలవ్వియెంచి జూడ
నైన యుగములు నాల్గనవి రెండు వేలరిగి
ననొకదినంబగు నజునకు;

తే॥గీ॥ నతడువైమార్లరుగు విష్ణుకగును ఘడియ
శంభునకు హరి వైమార్లు జనిన నగువి
ఘడియ; శంభుడు వైమార్లు గడవ శక్తి
కగునర విఘడియ యిదే సుమీ కాలగణన॥

తాత్పర్యము : నరుని కాల ప్రమాణమను సరించి బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యొక్కయు, శక్తి యొక్కయు కాలములు లెక్కింపబడినవి.

ఎట్లనగా : మానవుని కారు శ్వాసలు నడచిన కాలము = ఒక విఘడియ; 60 విఘడియలు = 1 ఘడియ. 60 ఘడియలు = అహోరాత్రములు కలసిన ఒక దినము. 360 దినములు ఒక సంవత్సరము. అట్టి సంవత్సరములు 4320000 అయినచో 4 యుగములతో గూడిన ఒక మహాయుగము. అట్టి మహాయుగములు 2000 అయినచో అనగా 8640000000 = 864 కోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మకు ఒక దినము. అట్టి దినములు 360 అగుచో బ్రహ్మ కొక్క సంవత్సరము. అట్టి సంవత్సరములు నూరైనచో బ్రహ్మకాయుర్దాయము పూర్తి యగును. వేయిమంది బ్రహ్మలు గతించినచో విష్ణువుకొక ఘడియ మాత్రము కాగలదు. అట్టి విష్ణువు వేయిసార్లు పోయినచోగాని శివుని కొక్కవి ఘడియ కాలమేగాదు. అట్టి శివులు వేయుమార్లు పొయినగాని శక్తి కొక్క విఘడియకాదు. అని కాలగణనము మెరుంగుము.

4. తే॥గీ॥ ఎవరి శతవర్షములు వారికేగ వారు
మేను నెడబాసి తిరిగి జన్మింతు రట్టి
శక్తులకు లెక్కలేదాత్మ జలదియందు
వీచికల చందమున నుద్భవంచిజనును

టీక : వర్షము = సంవత్సరము, జలది = సముద్రము వీచికలు = కెరటములు

తాత్పర్యము : పై కాలమానము ప్రకారం ఎవర్కినూరు యేండ్లు పూర్తియగునో వారు శరీరమును విడచి చనిపోదురు. కాని తిరిగి పుట్టుచునే యుందురు. మహా సముద్రమునందు వచ్చిపోయెడి అసంఖ్యాక తరంగములవలె ఆత్మయందు ప్రాణశక్తి వలన లెక్కలేనన్ని వ్యష్టిజీవోపాదులు వచ్చుచుపోవుచూ నుండును. అనగా మరల మరల జనన మరణముల జెందుచుండును.

5. కం॥ వనిధి ప్రవాహము వలె మన
కనులకు గనుపించునట్లు గాన్పించు జగ
జ్జననం బాత్మలో మృషయని
కనువారికి ప్రళయ పంచకము లేదెపుడున్

టీక : వనిధి = సముద్రము; మృష = అసత్యము.

తాత్పర్యము : సముద్రమునకు ఒక చోటునుండి మరొక చోటికి ప్రవాహరీతిగా ప్రవహించడమనే దుండదు. ఐనను పోటు - లోనుండి పైకి పొంగుటయు; పాటు = పైనుండి లోనికి క్రుంగుటయున్ను కలవు.
ఈ పోటు పాటులను జూచి సముద్రము గూడనొక ప్రవాహమేనను భ్రాంతి కలుగవచ్చును. అట్లే ఆత్మకు సంకోచ వికాసములు మాత్రమే గలవు. ఐనను జగత్తు దానిలో యుత్పత్తి స్థితి నాశనములు పొందుచున్నట్లు కనుపడుచున్నది. ఇది భ్రాంతియే గాని సత్యము గాదని తెలియువార్కి పంచ ప్రళయములున్ను లేనేలేవు.

6. తే॥గీ॥ జీవ శివుల సుషుప్తులు, జీవశివులు
తను విసర్జనములు, మహాతత్వసృష్టి
లేనే లేదని గురునిచే తానెరుగుట
ప్రళయ పంచకమిది యెపోభక్తియుక్త

**తాత్పర్యము** : (1) జీవుని యొక్క సుషుప్త్య వస్థ (2) ఈశ్వరుని సుషప్త్యవస్థ (3) జీవుని శరీర విసర్జనము (4) ఈశ్వర శరీర విసర్జనము మహత్తుయొక్కయు దాని నుండి వచ్చి జగజ్జీవేశ్వరుల యొక్కయు సృష్టిలేనే లేదని గురుబోధచే నారూఢ పరచుకొనుట అను నీఐదుపంచప్రళయములు అని చెప్పబడినవి. అనగా జీవుని సుషుప్తి మరణములు రెండున్ను ఈశ్వరుని సుషుప్తి ప్రళయములురెండున్ను సృష్టియేలేదని గురువాక్యరీత్య రద్దు పరచుట అను ఐదున్ను పంచప్రళయములు.

7. కం॥ అనవిని శిష్యుడు మునుపటి
తనమది సంశయము బాసి తానుండెను యే
మనుజుడు యిది విని చదివిన
జనన స్థితి నాశములను జెందరు వారల్

**తాత్పర్యము** : పై విధముగా జెప్పబడిన గురుని ప్రబోధ విని శిష్యుడు సర్వసంశయ రాహిత్యము బొందెను. ఎవరీ పద్యముల పఠింతురో వారు జన్మస్థితి నాశములను తిరిగి బొందరు.

8. ఆ॥వె॥ పరశురామ వంశభవుని సీతారామ
గురుని గొల్చి యట్టి గుట్టు భాగ
వతుల కృష్ణుడనెటి వసుధామరుడుదెల్పు
కొనియ బోదలెవ్వి గోర బోక॥

**టీక** : వసుధామరుడు = బ్రాహ్మణుడు

**తాత్పర్యము** : పరశురాములవారి వంశములోనుదయించిన సీతారామ గురుని సేవించి భాగవతుల కృష్ణుడనెడి బ్రాహ్మణుడు యితర బోదలేమియు గోరక గోప్యముగా నున్న యీ గురుబోదను తెల్సుకొని ధన్యుడయ్యెను.

## హంస సంచార చతుష్కము

9. సీ॥ హంస సంచార ప్రశంస మీరిది లెస్స
వినరయ్య జనులారా మనసుబెట్టి
యొక శిష్యవరుడు దేశిక చక్రవర్తిని
గని ప్రశ్నజేసె యీ కాయమందు
హంసచరించు నంచన వింటి నవియెట్లో
తెల్పవలెనన్న గురువరుడు బల్కె
యొక దినంబు నిరువదొక్క వెయ్యినూర్లు
నారు దిరుగు గుదమాదిగాను
తే॥గీ॥ గుదమునను గుహ్యమున నాభి కుహర్గమాడు
హృదయ కంఠాక్షి మూర్థుల వదలకారు
నూరు లార్వేలు నరువది నూరు లారు
వేలు వెయ్యి వెయ్యి వేయిమార్లు వేసరిలక॥

**టీక** : హంస = ప్రాణము, ప్రాణశక్తి

దేహములందు శ్వాస, నిశ్వాస రూపంగా సంచరించునది జీవుడు

**తాత్పర్యము** : జనులారా ఈ శరీరమందు ప్రాణ సంచార క్రమమున వివరించి చెప్పెద నాలకింపుడు ఎట్లనగా ఒక శిష్యుడు తన గురుమూర్తిని జేరి "మీ శరీరమంద హంప తిరుగుచుండునని అనుకోగా వింటిని అది యెట్లో తెలుప గోరుచున్నాను" అని పల్కగా గురువిట్లు తెల్పదొడగెను. గుదస్థానము మొదలుకొని సహస్రార పర్యంతము దినమునకు 21,600 (ఇరవై యొక్క అరువందల) సార్లు హంస దిరుగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| గుదస్థానము నందు = | 600 | గుహ్యస్థానము నందు = | 6000 |
| నాభిస్థానము నందు = | 6000 | హృదయ స్థానమునందు = | 6000 |
| కంఠస్థానము నందు = | 1000 | నేత్ర (భూమధ్య) స్థానము నందు = | 1000 |
| మూర్ధ్ని స్థానము నందు = 1000 | | | |

వెరశి 21,600 సార్లు ధిరుగును, అనగా ఆయాస్థానముల అన్ని హంసలు జరుగు కాలము నిల్చును అని భావము.

10\. సీ॥ తెలియు మాధార స్వాధిష్ఠాన మణిపూర
క నహాత విశుద్ధ కమలములకు
మీద నాజ్ఞేయ మామీద సహస్రార
మందు నచట నేలుచుండు దొరలు
హేరంబ వాకృతి హరిహర జీవేశ
గురువుల్లశంబుల క్రమముగాను
నాల్గారు పదిమూడు నాల్గులు పదియారు
రెండులై యుండును దండిగాను

తే॥గీ॥ శక్తులక్షరముల భూత సమితి బీజ
ములు దిశలు కాంతులు ముఖముల్ మొదలుగాగ
గలవనేకము లవియన్న గణనజేసి
పెంచలేవాదు ముచ్చట పెరుగుననుచు

**టీక** : హేరంబ = గణపతి; వాకృతి = బ్రహ్మ

**తాత్పర్యము** : ఆధార చక్ర కమలము (ఆధారచక్రము) స్వాధిష్ఠాన చక్రము, మణిపూరక చక్రము, అనాహత చక్రము, విశుద్ధ చక్రము, ఆజ్ఞేయ చక్రము, సహస్రార చక్రము అనునవి ఏడు చక్రములు అని తెలియుము.

ఆ చక్రములకు వరుసగా గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులను జీవ, ఈశ్వర గురువులను అదిష్ఠాన దేవతలై పాలించు చుందురు

4, 6,10, 12, 16, 2 సంఖ్యగల దళములు వరుసగా నా చక్రముల కుండును. (7వ చక్రరకమును సహస్రారమునకు 1000 దళములు) మరియు ఆ చక్రమునకు శక్తులు, అక్షరములు, భూతములు,బీజములు, దిశలు, కాంతులు, ముఖములు, మొదలగుననేకములు గలవు.

**భూతములు** :- పృధ్వీ, జలము, అగ్ని, వాయువు అకాశము, మహాతత్వము, సాక్షి.

**ఆకారములు** :- చతుష్కోణాకారం, అర్ధచంద్రాకారం, త్రికోణాకారం, షట్కోణా కారం, వర్తులాకారం, త్రికోణావర్తులాకారం, షట్కోణా వర్తులాకారం

**బీజములు** :- లం, వం, రం, యం, అం, సం, ఓం

**శక్తులు** :- క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, ఆదిశక్తి, పరాశక్తి, చిచ్ఛక్తి, సహజాత్మకశక్తి

**ముఖములు** :- సద్యోజాతముఖము, వామదేవముఖము, అఘోర ముఖం, తత్పురుష ముఖము, ఈశానముఖము, అంతర్ ముఖం, ఊర్ధ్వ ముఖం

**ఇంద్రియములు** :- ఘ్రాణము, జిహ్వ, చక్షు, త్వక్కు, శ్రోత్రము, మనస్సు, జ్ఞానము

**అక్షరములు** :- వ, శ, ష, స; బ, భ, మ, య, ర, ళ; ప, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ; క............ట వరకు, అ..........అం, అః వరకు, హం, క్షం, ఓం

**నాదములు** :- కింకిణీ, వీణా, వేణు, శంఖ, అబ్ధి, మేఘ, ఝూంకార

**భక్తులు** :- సద్భక్తి, నైష్టిక, అవదాన, భవ, స్వానంద, సమరస, పరమ

**వర్ణములు** :- రక్తవర్ణము, శుభ్ర, అసిత, ధూమ్ర, సునీలము, మాణిక్య, చిత్ర

**కాలము గ॥ని** :- 6-6.40, 6.40 - 1.20, 1.20 - 8, 8 - 2.40, 2.40 - 3.46-40, 3.46-40 - 4.53-23, 4-53. 23-6.

**విశేష వివరణ** :- యీ చక్రములకు యీ పేర్లు ఎందుకు రావలయును?

**1. మూలధారచక్రము** :- కుండలినీ శక్తి రూపమైన బిందు తత్వమునకు జగత్ వ్యాపార వృత్తి కలిగి నపుడు నిలుచుటకు ఆధారముగా వున్నందున మూలాధార చక్రమని పేరు కలిగియున్నది. మరియును 84 లక్షల జీవోపాదులు నిలుచుటకు భూమియే ఆధారముగా నున్నది. ఆ భూమి మూలాధార చక్ర సంబంధమై యున్నది. కనుక ఈ చక్రమునకు మూలాధార చక్రమని పేరు వచ్చినది.

**2. స్వాధిష్టాన చక్రము** :- సృష్టి వ్యాపారమునకు పూనుకొని తన ప్రతాపము చూపుచు తనచేత అధిష్టింపబడిన ఈ చక్రమునకు స్వాధిష్టానమని పేరు వచ్చినది.

**3. మణిపూరక చక్రము** :- సాధకుడు అరాధనచేయు సమయమున మణిమయంబులై మ్రోగుచుండు అందెలు కడియములు కిరీటము భుజకీర్తులు

మొదలగు నగలచేత తన శరీరమును నిండించెడు స్థానమగుట వలన ఈ చక్రమునకు మణిపూరకము అని పేరు వచ్చినది.

**4. అనాహత చక్రము :-** సాధకుడు పూజాకాలమందు విఘ్నకారులగు భూత ప్రేత పిశాచ రాక్షసులను పారద్రోలుటకు మంగళ వాయిద్యములు చేయుట ప్రసిద్ధము అంతరము నందు అట్టి వాయిధ్యములు ప్రయోగించనక్కరలేకుండగనే వినబడును. దశవిధ నాదములు కలుగు చుండుట వలన ఈ చక్రమునకు అనాహత చక్రము అని పేరు వచ్చినది.

**5. విశుద్ధ చక్రము :-** సాధకుడు శుద్ధ స్పటిక వర్ణములో తన్ను ధ్యానించు చోటు అగుట వలన విశుద్ధ చక్రము అని పేరు వచ్చినది.

**6. ఆజ్ఞేయ చక్రము :-** కార్యకర్తలగు అధిదేవతలగు కార్యానుకూలమగు ఆజ్ఞలు ఈ స్థానము నందుండియే నొసంగ బడుచున్నది. కనుక ఈ చక్రమునకు ఆజ్ఞేయ చక్రమని పేరు వచ్చినది.

**7. సహస్రారచక్రము :-** ఆరమనగా రేఖ లేక రేఖు వెయ్యి రేకులు గల పద్మమగుటచే సహస్రారము అనిపేరు వచ్చినది. వెయ్యి అనగా అనేకము అను అర్థముకాని పది వందలు అని అర్థము కాదు.

ఈ చక్రములన్నియు సూక్ష్మశరీరరము నందలి ప్రాణమయ కోశమునందై వున్నవిగా నిర్ణయింపబడినవిగాని స్థూల శరీరమునందున్నవి కావు. కనుక మన నేత్రములకు కానరావు

ఈ హంస విచారణము నంతయు తారకయోగము నందు చెప్పబడును. "తారకంబు మనశ్శుద్ధి కారకంబు" అని చెప్పబడినది. తారక యోగము ప్రాణాయామాది అంగమునకు అభ్యసింపబడిన యెడల మనో విక్షేపము అణగిపోయి ఏకాగ్రతసిద్ధించును. పరిపరి విధముల పరిగెత్తే మనస్సుని తనలోపలకి ఆవృత్తిగావించుకొని తనయందే దిగువనుండి ఎగువకు ఒకదానిపై ఒకటి నిర్ణీత స్థానమందు ఆయా చక్రములు వున్నట్టును ఆ చక్రమునకు వర్ణశక్తి దేవత ఇత్యాదులుగా యెన్నియో విషయములను నిర్ణయించి వాని యందే మనస్సును తిరుగుటకై నియమించి మనస్సును అన్యత్ర పోకుండుటకై మనస్సును

ఆలంబనము చూపుచూ ఆసనముద్ర లక్ష్య ప్రాణాయామములను సహాయ కారులుగా స్వీకరించి కొంతకాలము తీవ్రముగా అభ్యాసము గావించుచూ సాధనజేసిన యెడల క్రమశః నా చిత్త విక్షేమునకు సావుకాశము లేక స్థిరమై అచంచలమై మనస్సు నిలువ గలదు అని నిర్ణయింపబడినది.

తారక యోగమువలన ఇంతకంటె ప్రయోజనము లేదు. తారకము వలనే మోక్షము సిద్ధించుననుట సరికాదు.

కం॥ అని గురుడుపదేశించిన
విని శిష్యుడు సంతసమున; విస్మితుడగుచున్
విను జనులత్యానందం
బున అట్లున బొందగలరు బుధనుతులగుచున్॥

తా॥ పైన చెప్పిన విధముగా గురుడు తారకవిధానమంతయు ఎరిగించగా శిష్యుడు సంతోషాశ్చర్యములతో నాలకించెను. అట్లే దీనిని చదివిన జనులందరును పండిత కర్తకు పాత్రుడై ఆనందమున విలసిల్లగలరు.

ఆ.వె॥ ప్రేమతోడ పరశురామ సీతారామ
గురుడుదెల్ప హంసనెరిగి భాగ
వతుల కృష్ణుడనెడు వసుమతీశుండది
వదల దయ్యెమదిని ముదము జెందె ॥

తా॥ తన గురుడైన శ్రీ మత్పరశు రామ సీతారామ స్వాముల వారు ఎంతో ప్రేమతో తనకుభోదించగా శిష్యుడైన శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు అనెడి బ్రాహ్మణోత్తముడు శ్రద్ధగా విని సంతోషము చెంది విషయమంతయు తన మనస్సు నందు విచారణ చేసుకొనెను.

ఈ తారక యోగమును గూర్చి సమగ్రమైన విచారణ జరిపి పీఠగ్రంధముగా "తారకామృత పరమహంస ప్రబోధిని" అను పేర శ్రీమత్ దయానంద పాన్నాల రాజయోగీంద్రుల వారు ప్రకటించియున్నారు. దీనిని పఠించిన పాఠకులకు అనేక ముఖ్యాంశములు స్మృతిలోనికి రాగలవు.



ఓం

శ్రీ గురుభ్యోనమః

# రాజయోగి తత్వసుధ



(గురు సంకీర్తనము తత్వశోధనము)

ప్రకాశకులు :

## శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

బి.యే; బి.యల్;

నర్సాపురం : : (ప॥గో॥జిల్లా)

తృతీయ ముద్రణ 28-11-1998

రచయితలు - పురుష విభాగము

1) యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు, బి.ఎ; బి.ఎల్;
1 పేజి నుంచి 26 పేజి వరకు

2) మంచిరాజు శ్రీనివాసమూర్తిగారు
3) చోడిశెట్టి నారాయణగారు
4) కరుబ సుబ్బారాయుడు గారు
5) భీష్మా కోటేశ్వరరావు గారు
6) కొండమడుగుల వెంకటరెడ్డి గారు
7) మల్లంపల్లి వీరభద్రరావు గారు
8) యల్. విఠల్ గారు
9) పాటల పండరీనాద్ గారు

రచయిత్రులు - మహిళావిభాగము :

1) చెన్నాప్రగడ విజయలక్ష్మి (రాఘవ)
2) అవసరాల శేషగిరమ్మగారు
3) యిలపకుర్తి సీతామహలక్ష్మి గారు
4) కొవ్వలి గంగమాంబగారు
5) చల్లా రుక్మిణమ్మగారు
6) ఓగిరాల రంగానాయకమ్మగారు
7) లక్ష్మి ఓబులపతి గారు
8) కొండేపూడి సత్య ప్రసూనాంబగారు
9) మండపల్లి వెంకటరత్నావతిగారు
10) గాదిరాజు విజయలక్ష్మిదేవిగారు
11) వేడంగి సీతామహలక్ష్మిగారు
12) యిలపకుర్తి రాధగారు

ఓం

శ్రీ గురుభ్యోనమః

# తొలిపలుకు

1965 జూలై నుండి 1980 వరకు ప్రచురింపబడిన, "రాజయోగి" వేదాంత మాసపత్రికలలో ప్రకటింపబడి యింత వరకు యేగ్రంథములోను ప్రకటింపబడని పద్యములు, కీర్తనలు, తత్వములు. ఒక గ్రంథ రూపములో ప్రచురించమని భక్తులు కోరినందున, యీ గ్రంథము వెలువర్చుడమైనది. వారిలో వారు విరాళములు ప్రోగుచేసి యీ గ్రంథ ముద్రణావ్యయము భరించి యున్నారు. వారందరికి శ్రీ గురు పరమాత్మ కృపచే సకల శుభములు కలుగుగాక.

ఈ తృతీయ ముద్రణ స్వల్ప వ్యవధిలోనే పూర్తి చేయించి యిచ్చిన వార్కి నా కృతజ్ఞతలు.

ప్రతి రచనయు గురుదేవులకే రచయితలు అంకితము యిచ్చివున్నారు. అయిననూ శ్రీమద్రామడుగు శివరామదీక్షిత

గురుపీఠ రాజయోగాశ్రమాధ్యక్షులైన శ్రీమదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్య శ్రీ చరణములకీ గ్రంథమును మరియొక పూజాపుష్పముగా సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు

ప్రకాశకులు :

**శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు**

బి.యే; బి.యల్;

**నర్సాపురం**



ఓం
శ్రీ గురుభ్యోనమః

# యిలపకుర్తి వీర వెంకటరామచంద్రరావుగారి

# ❁ రచనలు ❁

## శ్రీ గురు పరంపరా సీస షట్కము

1. సీ॥ శ్రీకార ఓంకార చిరశుభాకారుడౌ
శ్రీ మహావిష్ణుని చేరి గొలుతు
లోక బాంధవుడంచు లోకులు నుతిజేయు
సూర్యదేవునికి బ్రస్తుతు లొనర్తు
ఎండుమోడుల చిగురింపజేసిన యాజ్ఞ
వల్క్య మునీంద్రుని ప్రజ్ఞ నెంతు
అశ్వంబు నెక్కెడినంతలోన ప్రబోధ
బడసిన జనకుని బ్రస్తుతింతు

గీ॥ రాజయోగ రహస్య విభ్రాజితులగు
శుక మునీంద్రుని సాందీపుస్తుతి యొనర్తు
కృష్ణ పరమాత్మ నెమ్మదిగీలు కొలిపి
అర్జునాది భక్తాళిని యభినుతింతు

2. సీ॥ శ్రీ మించు నీ బోధస్థిరపర్చి యజ్ఞాత
స్మృతులైన పరిపూర్ణ ఋషుల దలతు
కాలవాహిని మరుగైన బ్రహ్మానంద
స్వామి రామానందస్వామి ప్రభుల
జ్ఞానేశ్వర సహజానంద రామవధూత
యంబికాశివుల కంజలి ఘటింతు
తేటమాటలతోడ దివ్య ప్రబోధంబు
దశ దిశల్ జాటిన ధన్యజీవి

తే॥ వేమ యోగీంద్రు మనసార వినుతిజేతు
స్వామి తిరువేంగళార్యుని సంస్మరింతు
భాగవత వ్యాఖ్య నిష్ణాత పరమ యోగి
శ్రీ ధరేంద్రుల చరణాబ్జ సేవ జేతు

3. సీ॥ ఆంధ్ర గీర్వాణ బాషల, నేర్చి నిగమాగ
మోపనిషత్సారమును యెరింగి
క్రతు శతంబులు నిష్టగావించి, తొలుదొల్త
నద్వైతమతము సిద్ధాంత పరచి
పూర్వ పుణ్యోదయమున పూర్ణగురువగు
శ్రీధరు కరుణా విశేష లబ్ధ
పరిపూర్ణ సామ్రాజ పట్టాభిషిక్తుడై
తెనుగు భాషలో బోధ తెరువు జూపి

గీ॥ ఆంధ్రదేశంబు ఋణపెట్టినట్టి దిట్ట
తనువు ఖండింప రక్తపాతంబు లేని

అచల ఋషివర్యుడశరీర యమరజీవి
నతని శివరామనామ దీక్షితుల గొలుతు

4. సీ॥ గురుమాట జవదాటకుండు కంబాలూరి
అప్పరాణ్మంత్రి కంజలి ఘటింతు
ఎవ్వాని వాక్శుద్ధినేహ్య వస్తువులెల్ల
సరసాన్న భక్ష భోజ్యంబులాయె
నామహా మహితాత్ము నకళంకుని పరశు
రామ సీతారామస్వామి గొల్తు
ప్రాగర్థచరమార్థ యోగంబులకు రెంటి
కాధారమును, దాని కవలిదాని

గీ॥ యాంధ్రబాష కందార్థ కందముల వ్రాసి
బోధ గూడార్థ ధర్మ విస్ఫూర్తి జేసి
వ్యక్త పరచిన శ్రీ భాగవతుల కృష్ణ
దేశికేంద్రు భజింతు హృద్వీధి నిలిపి

5. సీ॥ సిద్ధేశ్వర గురుని సేవించి యోగియై
భక్తి జ్ఞానంబుల భ్రాంతి విడక
కృష్ణ దేశికుచేరి కేవలాత్మనుగన్న
పీల్ఖాన లక్ష్మణు పేర్మిదలతు
పరవంపు ప్రాయంబు గురుసేవ కర్పించి
ద్వాదశాబ్దంబులు తగభజించి
శ్రీఖాకొళంబాది చిత్తూరు వరకును
దివ్యమౌ బోధ ప్రతిష్ఠచేసి

గీ॥ పూర్ణబోధ గ్రంధ ముద్రణకర్త యౌ
దేశీ కేంద్రు వేంకటేశు నెంతు
వాక్యత్రయము వ్రాసి లోక త్రయము దూసి
అచలుడైన హనుమయార్యు గొలుతు

6. సీ॥ సచ్ఛాత్ర ధర్మంబు సల్పుచు వెనువెంట
దుర్గమారణ్య వీధుల దిరుగుచు
హనుమంతరాయ దివ్యాంఘ్రుల భజియించి
పరిపూర్ణ సిద్ధాంత భావమెరిగి
అవధూత బోధామృతాబ్ధిదోగాడి దీ
క్షిత గురు పీఠాభిషిక్తుడయ్యె
తానుగా వేద వేదాంత శాస్త్రార్థముల్
హిందీని చదివి వరేణ్యుడయ్యె

గీ॥ నట్టి శ్రీ దయానంద పాన్నాల రాజ
యార్య చరణ ధూళిని శిరసావహింతు
నతని శుశ్రూషచె చరితార్థులైన
రామచంద్రాది భక్తుల ప్రేమ గొలుతు
సర్వమును నీవె సద్గురు సార్వభౌమ॥



# శ్రీ సద్గురు మానసిక స్తోత్రము

(కందార్థములు)

1) శ్రీ కరమగు నీమూర్తిని ప్రాకటముగనాదు హృదయ పద్మమునందున్ ఏకాగ్రభక్తి నిలుపుచు, లోకేశా పూజ సేయలో నెంచినానూ కదులకు మాని ప్రార్థించినానూ! ఒక కొంతసేపైననుందు వెందును బోకా ప్రకటామౌ అచలుడావూ భయమేమియని నిన్ను లోనెంచినానూ! కదలకు మాని ప్రార్థించినానూ॥

2) ఇంతగ ప్రార్థించిన, కాసింతయు దయలేద నీకు సేవ కునివయిన్? అంతలో కనుమరుగౌదువు. పంతంబిదియేల స్వామి వచ్చేయు వోయీ! హృత్పీఠమందూ విచ్చేయువోయీ! అంతా నీమయమాని, సంతసించితిగాని యెంతాని వేడీనాసుంతైన గనరావూ, వచ్చేయ వోయి హృత్పీఠమందూ విచ్చేయవోయీ!

3) చిరునవ్వులొలుకు పెదవులు, కరుణామృత వృష్టి గురియుకన్నులు శ్రీలన్ బురుడించు కర్ణయుగళము. వరసంపగి గేరు ముక్కూ వర్ణించుకొంటీ. మదినిడినోటా వర్ణించి కొంటి చిరుతగడ్డవు వంపూ, చిన్నారినొసలూను. మరిమారిజూచినే మురిసీ కన్నులు మూసీ, వర్ణించుకొంటీ మదినిడి నోటా వర్ణించు కొంటీ॥

4) చూచితి నీముఖచంద్రుని, చూచితి నీవెడదయురము సొంపగు భుజముల్, చూచితి హరి మధ్యంబును చూచితి సర్వాంగ

కమలా సుందార నేత్రా ! సుకుమార దివ్యా మంగళ గాత్రా చూచితి చూచితిసొంపైన నీమూర్తి నా చిత్త ఫలకము నందూ చిత్రంతూనానీ సుందార నేత్రా సుకుమార దివ్య మంగాళగాత్రా॥

5) శాపమొ గత జన్మార్జిత పాపమొ? నీరూపు మదికి బట్టదుస్వామి తాపత్రయాగ్ని తప్పదే నీపైనాధార పడితీ నిజగూరుమూర్తీ ద్వయదోష రహితా తత్వార్థస్ఫూర్తీ పై పైమాటలకింకా భ్రాంతీ రహితమూగాదూ. అపరోక్షముంజేయు మచలా పరిపూర్ణ భూమా నిజ గూరుమూర్తి ద్వయదోషరహితా తత్వార్థస్ఫూర్తీ ॥

6) సాకారమైనదగునో? ఆకారములేనిదగునో ? అచలమె యగునో? కాకున్న యిన్నియగునో? లోకేశా నీనిజస్వరూప మేదోయీ? అపరోక్షమైతే సేవింతునోయీ నా కన్నులతో గానీ నామానస్సుతోగానీ, లేకున్న యెరు కేమీ లేనిదానితో గాని రూపామేదోయీ? అపరోక్షమైతే సేవింతునోయీ॥

7) నామది దేవాలయముగ స్వామీ నివసింపు మిందు వదలకలేదా. నామానన మిదెగ్గైకొని యేమైనను జేసికొమ్మా. యిది నా కింకేలా? నిజ గురూ భక్తా సంత్రాణశీలా నా మాటా మన్నించీ, నా మీద దయయుంచీ కామితార్థమునీవే. కల్పద్రుమమూనీవే ? యిదీ నా కింకేలా? నిజగురూ భక్త సంత్రాణశీలా॥

8) నా మనసు, బుద్ధి, చిత్తము, నా మేనును లేనినేను నా

ప్రాణములున్ నా మానము సర్వస్వము యేమైనను చేసి కొమ్మూ యిచ్చేదనయ్యా- రమ్మన్న నీతో వచ్చేదనయ్యా నా మనో బీష్టమూ : నయ మొప్పాదీర్చితె, నీమాది కింపైనాదే, దేది గైకొమ్మూ యిచ్చేదనయ్యా రమ్మన నీతో వచ్చేదనయ్యా॥

9) చప్పున కృపజూపింపక తప్పదు యెటులైనగాని, తప్పినచో నీయప్పకు హనుమంతప్పకు చెప్పెద నేరంబు రుజువూ చేతూ నీమీదా అవధూతస్వామీ కప్పిలా మీదా యెప్పాటికైనా, నాహృద యాంధకారాన తప్పాక బంధించీ దండించునట్లుగ జేతూ నీమీదా అవధూతస్వామీ కపీలా మీదా॥

10) సామము, దానము, బేదము యీ మూడును వ్యర్థమాయె! యిక నీయడలన్ ఈ మారు దండనంబే భూమా కన్నీటి యేటా ముంచెత్తావలెనా? పన్నీటిధాటి సాక్కించవలెనా? నీమేను దూలింతూ నిట్టూర్పుగాడ్పులా సుమగాత్ర సురటీల సుడిగాలి కెరుటాలా, ముంచెత్తావలెనా? పన్నీటిధాటీ సాక్కించవలెనా?

11) ఎంతటి యపచారంబో స్వాంతంబున నెంచనైతి స్వామీ నిన్నున్, యెంతెంతమాటలాడితి, క్షంతవ్యుడగాను నిజమూసద్గూరు వర్యా! పొన్నాలా శ్రీ రాజేంద్రవర్యా! ఇంత లింతలు సేయా యెరెకె మూలమూగాన, చింతాతీరును దీన్ని చీల్చి శిక్షింతువేనీ సద్గూరువర్యా ! పొన్నాలా శ్రీ రాజేంద్రవర్యా !

12) గురుసత్తా కెనయైనది. మరిలేదని యార్యులనేడి మాటలు వినవో ? గురుపదసేవా నిరతుడ, గురుతెరిగే నాదు తెల్వి గుల్పాగలేవా ? దేవాదిదేవా, దివ్యప్రభావా? భూమా నందులా కృపా బొందీతి వటులానె. శరణన్నా యీ రామచంద్రూని లేనెరుకా గూల్పాగలేవా? దేవాదిదేవ దివ్య ప్రభావా?



## గురుమూర్తమ్మా గురుమూర్తి (కీర్తన)

(బూచోడమ్మా - బూచోడు వలె)

పల్లవి : గురుమూర్తమ్మా గురుమూర్తి - గొప్పకురుచలై యాన్నాడూ కళ్ళకెపుడు కనుబడడు కర్మలన్ని చేస్తాడూ ॥ గురు॥

అనుపల్లవి : పెద్దవానిలో పెద్దవాడుగా కొద్దివానిలో కొద్ది వాడుగా? యెందు వెదకితే నందే యుండీ అందరి కళ్ళూ మూస్తాడు. ॥గురు॥

1) కంటిచూపులోనున్నాడూ, కంటిగుడ్డులోనున్నాడూ కంటికి రెప్పలకంటె చేరువై కానరాకనేయున్నాడు. ॥గురు॥

2) సృష్టికి పూర్వంబున్నాడు సృష్టియె తానై యున్నాడూ సృష్టి నాశములు చేయుచు వానినంటీయంటక యున్నాడు ॥గురు॥

3) చూచేవాడూ వాడేనమ్మ తోచేవాడు వాడేనమ్మా చూపు మనసులకు అందను నేనని చోద్యపు పల్కులు వినపిస్తాడూ

॥గురు॥

4) ఏది చూచినా అతని రూపమే యేదివిన్ననూ అతని కంఠమే పంచ విషయములు తానేయై, యవిమించిన పూర్ణుడ నంటాడు.

॥గురు॥

5) భక్తికి సులభూడనంటాడూ తానే ముక్తికి స్థానం బంటాడూ నీవే నేనని యంటాడూ యిక నిన్ను విడువమని యంటాడూ.

॥గురు॥

6) శికిందర్‌పురిలో నున్నాడూ శీతారాముల బ్రోచేడూరాజ యోగమున నున్నాడూ శ్రీ రాజయోగి పేరొందాడూ ॥గురు॥

## గుర్వ్యష్టకములు (కీర్తన)

పల్లవి : ఎందుకన్నా - ఎన్నున్నా
ఏదివున్నా - అదిసున్నా

అనుపల్లవి : గురుపాదస్మరణే లేకున్నా - గురుడుమదిలోలేకున్నా
యేదివున్నా అదిసున్నా ॥ఎందు॥

1. ధనధాన్యంబులు యెన్నున్నా
పుత్రపౌత్ర సంపదలున్నా
బంధువులున్నా పరిజనులున్నా ॥ఎందు॥

2. వేదశాస్త్రములు చదివున్నా
వివిధవిద్యలు నేర్చున్నా
కవితాసంపద కలిగున్నా ॥ఎందు॥

3. స్వదేశమందున కీర్త్యున్నా
విదేశముల ప్రఖ్యాతున్నా
పదువులున్నా ప్రభుత్వమున్నా ॥ఎందు॥

4. రాజాధిరాజులు తలవంచినా
తలవంచి పదములు సేవించినా
భూమండలంబే పూజించినా ॥ఎందు॥

5. భోగమున్నా త్యాగమున్నా
మహిమలున్నా యోగమున్నా
రమణులున్నా రాజ్యములున్నా ॥ఎందు॥

6. దానకర్ణుడని పేరున్నా
దర్మరాజనీయుశమున్నా
శౌర్యధనుండని కీర్త్యున్నా ॥ఎందు॥

7. అందమున్నా చందమున్నా
అందలమెక్కే సుందరుడన్నా
అడవి నున్నా యింట నున్నా ॥ఎందు॥

8. మణిమాణిక్యములెన్నున్నా
మగువల తో బిగికౌగిటనున్నా
శారద రాత్రివిహారములున్నా ॥ఎందు॥

9. యతియైనా భూపతియైనా
వర్ణాశ్రమంబులేనైయున్నా
వీనిపతించిన సంస్కృతి సున్నా ॥ఎందు॥

10. రాజయోగి గురుకృపయున్నా
రామచంద్రునీ తీరున్నా
జయమునిశ్చయమౌనన్నా ॥ఎందు॥

## తత్వము

పల్లవి : "నేను" అన్నది యేదిరా - అది - లేని దేయని నమ్మరా వున్నదనుకొని నమ్మియిక వూబిలో దిగబోకురా ॥నేను॥

1. నాది నాది యనుచు నగుబాటు పాలుగాకురా. నేను లేకుంటేను యింక నీది, నాది, యేదిరా ॥నేను॥

2. నేను, నాది, నీవు, జగతి, లేనిదేదో తెలియరా అదియె అచలము, అదియెబయలు అదియె పరిపూర్ణమ్మురా ॥నేను॥

3. వున్నాడని వుండజూచి లేకున్న దానిని వీడరా జన్మ కారణ మట్లుపోతే జన్మలిక నెట్లెత్తేవురా ॥నేను॥

4. గురుని పాదముబట్టి నీవు, గుర్తుమూలము దెలియురా గురునిమంత్రమెగొడ్డలగుచును గొట్టివేయును వినుమురా ॥నేను॥

5. దీక్షితీయ దివ్యబోధిది తెలిసి పూనుము సోదరా రాజయోగిని గొలిచి ఫలము రామచంద్రుడు పొందెరా! ॥నేను॥

## జన్మానికొక శివరాత్రి మేలుకొలుపు (కీర్తన)

(పెండ్లి చేసి చూడులో - ఏడుకొండలవాడ వెంకటరమణా)

1) పల్లవి :మేలుకో గురురాయ ! మేలుకో మహనీయ !
మేలుకో తడవాయె మేలుకో
నా హృదయడోలికలోన మేలుకో నన్నేలుకొనవేగ మేలుకో

2) మేలుకొని యండియూ కలగాంచుచున్నాను
కలలోని భ్రాంతితో కలవరిస్తున్నాను
కలమేలుకొను యుక్తి గానలేకున్నాను
కలలోనె యేతెంచి కరుణతో మేల్కొలుప ॥ మేలుకో॥

3) చేపపిల్లారీతి చిక్కితిని వలలోన
చూపుచూస్తే చాలు చోద్యముగ పెరుగుతా
పెరిగి పెరిగే వలను భిన్న భిన్నముచేసీ
బయటపడిపోతాను బ్రహ్మాండమవలకే ॥మేలుకో॥

4) ఎదలోని యెదలోన పదిలముగా నీరూపు
నిరంతంబు నిలుపుకొని నిన్నెధ్యానించెదను
తాబేలుపిల్లనూ తలపోయు తల్లివలె
నామాటమరువకా జ్ఞప్తిలోనుంచుకొని ॥మేలుకో॥

5) రూపురేఖలులేని గ్రుడ్డులో రసమునూ
పక్షిగాబుట్టించు పక్షితల్లి రీతి

హస్తమస్తకస్పర్శ, పాదస్పర్శల నొసగి
నీదు నిజరూపమ్మె నిక్కముగ చేకూర్చ ॥మేలుకో॥

6) సాధనాలు చేయగా సామర్థ్యమదిలేదు
సర్వధర్మాలు నీచరణ సన్నిధిలోన
అర్పించి శరణంటి యఖిలంబు నీవంటి
నిన్ను నమ్మియున్న నన్నుద్ధరింపగ ॥మేలుకో॥

7) పరిపరివిధములా మొరలెత్తి మొరలెత్తి
వేడుచుంటిని వినగ విసుగువచ్చుటలేద?
శ్రీ రాజయోగీంద్ర శిష్యజనపాలకా
యీ రామచంద్రునీ యేలుటాతప్పదని ॥మేలుకో

8) శివరాత్రి నేడనీ శివుడు బుట్టాననీ
చెప్పకొని మురిపెంబు జెంద పసిపాపనా?
జ్ఞానపుత్రుడవగుచు నా హృదయగర్భమున
జన్మింపగానాడు జన్మకదె శివరాత్రి ॥మేలుకో॥



# నీరూపమే నాకు ధ్యేయం (కీర్తన)

పల్లవి: నీరూపమే నాకు ధ్యేయం ;
దేవా ! నీ నామమే నాకు మంత్రం॥

1. నీ రూపద్యానంబు నీ నామ స్మరణంబు
నిరంతంబు కలిగింపు మింకేమి నేనొల్ల ॥ నీ-రూప ॥

2. సాంఖ్య తారకా మనస్క సద్వివేకము దెల్పి
మహవాక్య లక్ష్యంబు మదిని నాటిన తండ్రి ॥ నీ రూప॥

3. తల్లి తండ్రీ గురువు దైవంబు విశ్వంబు
నీ రూపమే యంచు నిశ్చయము జెందించు ॥నీ రూప॥

4. అద్దమందున చూచికొన్నట్లు నాలోన
నీరూపు జూపవే నీవె నేనని దెల్పి ॥నీ రూప॥

5. భ్రాంతి మూలము నీవె బయలందు లేవురా
పరికించి చూడరా భ్రమ తొలగునని దెల్పు ॥నీ రూప॥

6. నీ పాద పద్మంబులే ప్రొద్దు సేవించు
యీ రామచంద్రనుత శ్రీ రాజయోగీంద్ర ॥నీ రూప॥



## పడిపోతి నేనెప్పుడో (కీర్తన)

(నడిరేయి ఏ జాములో వలె)

పల్లవి: పడిపోతి నేనెప్పుడో, దేవ కడలేని
వారాశిలో! ఘోర! సంసార వారశిలో ॥పడి॥

1. కెరటాలు లోనికే గెంటుచున్నాయి
ఎదురీదలేని నన్నీడ్చుచున్నాయి
జల చరంబులు కఱచి చంపుచున్నాయి
ప్రాణంబులా నన్ను బాయకున్నాయి
బ్రతుకు చావుల మధ్య నన్నుంచినాయి ॥పడి॥

2) నిజరూప మెట్టిదో నేమరచినాను
ఎటనుండి వస్తివో యెరుగంగలేను
తీరంబు చేరేటి తీరుగనలేను
నావైన నీవే నావికుడ వీవే
దరిజేర్చి రక్షించు దైవంబు వీవే ॥పడి॥

3) గురు మంత్ర జపమందు కూర్చున్న వేళ
మనసు ధ్యానమునందు మళ్ళించువేళ
నాల్గు శుశ్రూషలూ నడిపేటివేళ
నిజధర్మ కర్మముల్ నేరవేర్చువేళ
శక్తి సామర్ధ్యముల్ సమకూర్చవయ్యా ॥పడి॥

4) విషయవాసన నన్ను వేధించకుండ
స్వార్థాన దుష్కర్మ సల్పకుండంగ
సుఖ దుఃఖములచేత క్షోభించకుండ
నాయండ నిలచుండి నన్నేలవయ్యా
శాంతియానందముల్ సమకూర్చవయ్యా ॥పడి॥

5) దేహేంద్రియ ప్రాణధీమనంబులతో
సర్వార్పణంబుగా శరణన్న రామ
చంద్రూని చేబట్టి చేదుకోలేవా
రావా? దేవా? నను రక్షించి బ్రోవా
వరశ్రీ దయానంద బిరుదుతో లేవా ॥పడి॥



# "పరమ శివుడే నేడు ప్రభవించినాడండి"

(కీర్తన)

(అందాల పాపాయి - అవతరించిందండి - వలె)

పల్లవి: పరమశివుడే నేడు ప్రభవించినాడండి
భక్తులను గాపాడే ముక్తినొసగును రండి ॥పరమ॥

అనుపల్లవి: పొన్నాలవారింట పూర్ణ చంద్రుని రీతి
రాజయాఖ్యను బొంది రమణి మల్లమ్మకు ॥పరమ॥

1) శివరాత్రి నేడంట శివుడు పుట్టేనంట
తల్లితండ్రిలేని తనయూడు వాడంట
యేడనున్నాడొ వానిజాడ దెలియదంట
ఆతని వెదుక నేల యితడు మనకుండగా ॥పరమ॥

2) దయ్యాల భూతాల దైవంబు మనికేల
బూదిపూసుకు తిరిగె భూతనాయకుడతడు
రాజాధిరాజ సామ్రాజ్యాధిపతులచే
పూజలను బొందేటి పూర్ణపురుషుండితడు ॥పరమ॥

3) ముల్లోకములలోన మొదటి గురుదతడంట
మునుల యోగుల కతడు మోక్షమిచ్చూనంట
గురులాకు గురువైన గురుచక్రవర్తితడు
గుణరహీతులను జేసి గుర్తె బాపునురండి ॥పరమ॥

4) "జ్యోతిషాం జ్యోతి" పరంజ్యోతియని పేరొంది
లోకాల వెలిగించు అతిలోక వెలుగతడు
తేజోంధకారములు తెలివి మరుపులులేని
పరిపూర్ణ మెరిగించు పరమ పురుషుండితడు ॥పరమ॥

5) శ్రీరామచంద్రునీ చింతించి నిరతంబు
తారకము జపియించి ధన్యుడైనాడతడు
ఈ రామచంద్రునీ యీ సీతదేవినీ
ధన్యులను చేసినా తాపసోత్త ముడితడు ॥పరమ॥

❋ ❋ ❋

## ఒంటివాడవు నీవుకావా (కీర్తన)

పల్లవి: ఒంటివాడవు నీవుకావా దేవా-బంటుగా నన్నేలుకోవా

అనుపల్లవి : బంటుగా నేన్నలుకొంటివా నా స్వామి

నీ మాటలే చెప్పుకొంటానురా
నీ పాటలే పాడుకొంటానురా
నీ కీర్తిలోకాన నిండిస్తారా ॥ఒంటి॥

1) జగములన్నియు నిండినావా నాదేవా
జగతిబైటను నీవులేవా ?
జగయుగంబున నీవెకావా నాదేవ,
సగుణనిర్గుణ నీవెకావా ॥ఒంటి॥

2) నీ యందు నేనుండలేదా, నా స్వామి
నన్నేల సంకోచమేమి?
పుట్టితిని నీ యందు పెరిగితిని నీ యందు
ఏడబోదును నిన్నువిడనాడి నేనింక ॥ఒంటి॥

3) అంతరంగామందు హాయిగానున్నావ?
యితరముండుటచేత యిరకైనదో యేమొ
యిల్లంత నీకిస్తి ఏమైన చేసుకో
ఏది తీసిన సరేఏదికోసిన సరే ॥ఒంటి॥

4) నీవునాయందుండ నేను నీయందుండ
నీయంతవాడ నేనౌదునా కావా ?
నేనంటె నీకింత చులకనా?
పెద్దవారిట్లుండ నగునా తగునా? ॥ఒంటి॥

5) నీ గురుని కృపచేత యోగసామ్రాట్టువై
రాజయోగను పేరు పొందెవురా :
భక్త సులభుడవంచు ప్రార్థిస్తిరా !
రామచంద్రుని నన్ను రక్షింపరా ! ॥ఒంటి॥



# జయ గురుదేవం (కీర్తన)

శిష్య : జయగురుదేవం - జయగరుదేవం ! గురుదేవం -
జయ - గురుదేవం

గురు : భజగురుదేవం - భజగురుదేవం గురుదేవం -
భజ-గురుదేవం
శరణువేడు గురుచరణము నమ్మి
మరణ భయంబుని బాపును సుమ్మీ ॥భజ॥

శిష్య : మరణమనగ భయమందు టేలనో
నిద్రవంటిదని నిర్ణయమేగా ॥జయ॥

గురు : మరణభయము యిసుమంతయు లేదు
తిరిగి పుడుదునని తీవ్రభయంబుర ॥భజ॥

శిష్య : పుట్టుటవలనా పోయినదేమి
పుట్టి సుఖంబుల పొందగరాదా ॥జయ॥

గురు : సుఖము హుళక్కీ దుఃఖమెతప్పదు
జన్మయెత్తి నా జనుల కందరకు ॥భజ॥

శిష్య : దుఃఖమయంబుగా దోచును జగమూ
దుఃఖకారణము తొలుత దెలుపవే ॥జయ॥

గురు : దుష్కృతమేసుమి దుఃఖము దెచ్చును
దుష్టకర్మలకు తృష్ణేహేతువు ॥భజ॥

శిష్య : తృష్ణననేమో తెలిపిదానినీ
దాటేడి మార్గము దయచేయగదే

గురు : ఆశయె తృష్ణ అదియే ఈషణ
దారాపుత్రధన వ్యామోహము

శిష్య : ఆశకుమూలంబది యెయ్యదియో
రాగద్వేషములేగతి దొలగునో

గురు : ఆత్మ ప్రేమయే అన్ని ప్రేమలకు
ఆది కారణంబనుచు దెలియరా
ఆత్మవస్తుకా మాయ సర్వమూ
ప్రియంభవతియని శ్రుతులు బల్కెరా

శిష్య : ఆత్మప్రేమ హరియించుటయె
ఆనతీయవే యనిశము మ్రొక్కెద

గురు : పూర్ణభావమును పొందుగ వినరా
భ్రాంతిమూలమూ పారిపోవురా

శిష్య : శీతారాముల శ్రీరఘుమెబ్రోచిన
రాజయోగిప్రభు రక్షింపగదే



## గురుశిష్య సంవాదం (కీర్తన)

శిష్యుని పల్లవి : నీకృపాలోకనము నామీదా ప్రసరింపరాదా
నేనునీవాడనేగాదా?

గురు పల్లవి : గురుకృపాలోకనము నీమీద, ప్రసరింపబోదా
గురుని బాటలో నడచినా మీదా !!!

శి॥ నీదుపాదముబట్టలేదా? నిన్ను గొలుచుచునుండలేదా
నీవు నేర్పిన మాటలన్నీ, నేర్చిపాటల పాడలేదా? ॥నీకృపా॥

గు॥ గుణములను మర్ధించినావా? కోర్కెలను నిర్జించి
నావా? గురు కృపాసంసిద్ధిలేదని గొడవ మాత్రము
చెసెదావా ॥నీకృపా॥

శి॥ సుగుణ దుర్గణ నైజగుణమూలూ త్రిగుణముల
పాళ్ళచేత గల్గూను, ఆగుణములను మర్దించుటకు
నాకలవియే సద్గురూమూర్తీ ॥నీకృపా॥

గు॥ నైజగుణముల బట్టి నీకూ నిజము సంకల్పములు
బుట్టును కాని వానీ పూన మానా కలదుగా
స్వాతంత్ర్యబుద్ధీ ॥గురుకృపా॥

శి॥ అష్టదళ పద్మం బునందునా, అన్నిదళముల
నన్నికోర్కేలూ ఏదిపూనను యేదిమానను
ఏట్టులాకోర్కెలను చంపుట ॥నీకృపా॥

గు॥ కోరికలు నీకుండదగునా? కోటివిధముల చేటుగాదా!
కోరికకు అడ్డంబుగల్గిన కోపమేజనియించుగాదా ? ॥గురు॥

శి॥ కోరికలు దీరినాపిమ్మట కోరికలుతలయెత్తజాలునే?
కామియేగాకుండ మోక్షగామిగాడనెవే మయోగీ ॥నీ॥

గు॥ కోరినట్టి వస్తువులు సమకూడినను లోభంబు
మోహము వస్తువేమైపోవునోయని భయముగల్గును
బంధమేర్పడు ॥గురుకృపా॥

శి॥ సర్వసంగముల పదలీసన్యసించి తపంజేయుచుమోక్ష
మందలి కోర్కెచేగద మునులు ఋషులు
ప్రాకులాడుట ॥నీకృపా॥

గు॥ మోక్షసంకల్పంబు గూడను, పూర్తిగా బంధంబె
యంచు ను! వుపనిషత్తు చెప్పలేదా వూరకే
వాదించనగునా? ॥గురుకృపా॥

శి॥ సంకల్పాది జీవగుణములూ చనునె జీవునివిడచియెటకోనూ
బ్రహ్మంబుగాదా జీవమెన్నడు నాశమొందదు జీవుడే

గు॥ రాజయోగిని శరణుబొందీ రామచంద్రుండెరిగినట్టి,
రాజయోగము దెలియవోయీ బ్రాంతులెల్లను
వీడుమోయీ ॥గురుకృపా॥



## ఏ పేరుతో నిన్ను బిల్తునోదేవా (కీర్తన)

పల్లవి : ఏపేరుతోనిన్ను బిల్తునోదేవా,
ఏవూరు నీదనీ యెంతునోదేవా

అనుపల్లవి : ఉండుటకు నూరూర నొకయిల్లుకట్టేరు
గుడిగోపురాలకు కోట్లు వెచ్చించేరు,
మూర్తిస్థాపనచేసిముద్దు పేరొకటుంచి, నైవేద్య
ములుబెట్టి సమమూగా భుజియింత్రు ॥ఏ పేరు॥

2) మావూరిదేవుడే మహగొప్పవాడంచు
దేవతలె కట్టెరుదేవాలయ బంచు
కథలేన్నో గల్పించి గ్రంథస్థమొనరించి
క్షేత్ర మహత్యంబు చెప్పి చూపిస్తారు ॥ఏ పేరు॥

3) ఏపూరుజెప్పిన యేకదేశమేయౌను
ఏపేరుజెప్పినా రూపంబే సిద్ధించు
దృశ్యంబులన్నియూ నశ్యంబులేగదా
తథ్యమిథ్యావిభేదంబు తెలియరో; ॥ఏ పేరు॥

4) విశ్వగతుడవెయైతె విశ్వంబెనీవైతె
కనులగానగరాను, మనసుకందగబోను
వాక్కుకందను నేను బ్రహ్మబునే" నంటే
నిన్నునమ్ముటకేను చిన్ని పాపాయినా ॥ఏపేరు॥

5) విశ్వంబుకావలా విశ్వేశ్వరుండవై
వెలుగువాడను. నేను విశ్వంబుకల" యంటె
కలలోని పురుషుడు కలకంటె భిన్నమా
పరిపూర్ణమున మూలపురుషుండె కలగదా ॥ఏ పేరు॥

6) కలమేల్కలని రెండుగలవాడనీ నేను
కలమేలక్కలేప్పుడూ గనరావుబయలందు
రాజయోగిమాట రామచంద్రుని పాట
క్లనరావు బయలందు కనుక నేనేముందు ॥ఏ పేరు॥



# నీచేతిలో బొమ్మ నేనోయి దేవా

(కీర్తన)

పల్లవి : నీచేతిలో బొమ్మ నేనోయి దేవా
నాకు దిక్కని నమ్మినానోయి దేవా ॥నీచేతి॥

అనుపల్లవి : ఎట్టులాడించితే నట్టులాడెదనోయి
ఎట్లు పాడించితేనట్లు పాడెదనోయి ॥నీచేతి॥

1) అంతటా నీవేను అన్నిటానీవేను
ఆటలాడించగా నాటకుడనీవేను
కర్తవై యుండియూ కర్తగానంటావు
ఇంద్రజాలములోన సిద్ధహస్తుడవోయి ॥నీచేతి॥

2) నీకోసమేగదా లోకమున నన్నిట్లు
సృష్టించి తెలివిచ్చి జీవుడని పేరెట్టి
ఎలుకతో పిల్లికీ చెలగాటమన్నట్లు
లీలకైనాతోడ హేలసల్పెదవిట్లు ॥నీచేతి॥

3) ఈ బొమ్మ వేషాల నెన్ని మార్పించితివోయి
ముచ్చటకు నొకటైన నచ్చలేదాస్వామి
వెఱ్ఱివేషములింక వేయించకుండగా
మాన్పించరాదొకో మరితిరిగిరాకుండ ॥నీచేతి॥

4) వేషంబుబాగా వేసినానని తోస్తే
త్రికరణమ్ముల నడక తిన్నగానుందంటె

శాశ్వతంబైన విశ్రాంతి చెందుమటంచు
పంపివేయుముచాలు బహుమతుల్ నేనొల్ల ॥నీచేతి॥

5) నాకర్మచే జన్మ నాకొచ్చెనంటావు
సంస్కార బలముచే సంకల్పమంటావు
చేయుటకు మానుటకు స్వేచ్ఛకలదంటావు
బుద్ధితో యోచించి పూనుకోమంటావు ॥నీచేతి॥

6) శబ్దాది విషయపంచకమును సృష్టించి
ఆకర్షణీయముగ నమరించి కట్టెదుట
కామ్యబుద్ధిని వాడి గడుపు జీవితమంటె
సాధ్యమా మనసెంతో చంచలముగదదేవ ॥నీచేతి॥

7) లోకమోహన దివ్య రూపంబుతో నీవు
సాక్షాత్కరించితే సమయుకోరికలెల్ల
విషయముల్ ముందుంచి వెనుక దాగెదవేల
మోసకారివిగాని మోక్షకారకుడవా ॥నీచేతి॥

8) దయయొరూపంబుగా దనరారుచున్నట్టి
దాతవంధురుగదా! దయదాచుకొనెనేల?
సీతారాములసేవ స్వీకరించీదేవ
పరశ్రీ దయానంద బిరుదై ననిల్పుకో ॥నీచేతి॥



# కోరుమని నన్నడుగవలెనా? (కీర్తన)

"కోరుమని నన్నడుగవలెనా కోరికేదో తెలియదా" నాకోరికేదో
తెలియదా స్వామి! నాకోరికేదో తెలియదా ॥కోరు॥

1) ధనము తెమ్మని యడుగగలనా ధాన్యమిమ్మనియడుగ
గలనా ధనకనకవస్తు వాహనంబుల క్షణికమంచును
నెరుగనా ॥నేనేక్షణిక॥

2) ఆయురారోగ్యంబు బలమూ, అమితధైర్యశక్తి
యుక్తులు, ఐహికసుఖ భోగ భాగ్య యశము,
పాండిత, కవితలూ ॥కోరు॥

3) ఈ షణత్రయ మేమిలేదు - వాసనత్రయ మసలెలేదూ
పదవులన్నను ప్రీతిలేదు - పంచముక్తుల భ్రాంతిలేదూ
॥కోరు॥

4) యిచ్ఛయే లేకుండ నుండట స్వచ్ఛమౌ యీ బోధ
పద్ధతి యిచ్ఛ మానుమటంచు మీరే గ్రుచ్చి గ్రుచ్చి
చెప్పలేదా ॥కోరు॥

5) ఏది యెప్పటికవసరంబో యేదిచేయుట ధర్మమౌనో
కర్తృభావము లేక యట్టి కర్మచేయుట దర్మమగునని
॥కోరు॥

6) ప్రళయ కాలాంభోధి పగిదిని బ్రహ్మమూ
విశ్వంబు రెండూ ఏకమై నిబిడమై యుండగ
నేమికోరుదు నేమివిడుతును ॥కోరు॥

7) ఏలస్వామి పరీక్షలింకను ఏలుకొను దీనుండ భక్తుడ
ప్రభువరా ! నీ కృపా దక్కాభ్రాంతిలే దన్యంబనందూ,
॥కోరు॥

8) దీక్షితా పీఠంబునందున తేజరిల్లెడు రాజయోగి
యిహపరంబుల భ్రాంతిముంచక సీతారాముల
నేలుకోనవె ॥కోరు॥



# కీర్తన

## (కన్నయ్యా నల్లని కన్నయ్యా - వరుస)

పల్లవి : వినరావా! నామొర వినరావా! ఓ సచ్చిదానంద
రూపా ! నిను పూజించిన నినుధ్యానించిన
జన్మరహితంబౌనుగదా ॥విన॥

1) అంతటనూ నీమూర్తియున్నదందురే
శుద్ధ మానసమందు రూపుదోచునందురే
మనసునకు దోచు నీవు నిత్యమౌదువా?
భక్తమందార నను భ్రాంతి ముంచకయ్య ! ॥విన॥

2) జ్ఞానంబు, జ్ఞేయమూ, జ్ఞాతవునీవే,
యెరుక మరుపుల నొందు వేత్తవీవే
ద్వయదోషయుతడవై వెలసినావూ
మోక్ష రూపుడవని యెట్లునమ్మగ గలనూ ॥విన॥

3) సృష్టిస్థితి లయములకు సాక్షివందు రేబయలందు
నీకు మూలమేమీ లేదే నీవు లేక తృణమైన
కదలజాలూనా? అకర్తవందు వదియేయో గుట్టు
దెల్పుమా? ॥విన॥

4) కలనుగనూ పురుషుడవుగావె నీవూ
యిట్టి నీవు మేల్కయందు లేనేలేవుగా
కలమేల్కరెంటి గురుకరుణచే నెరిగి
భ్రాంతిరహిత పూర్ణస్థితినీ బొందినావుగా ॥విన॥

5) ద్వయదోష రహితుడవని బిరుదువుండెనే
నాదోషములు నీమదినీ నాటగ గలవా?
జన్మరహిత స్థితిని నీనవుసాధించితివటగా?
నీకున్నదాని కోరితే యేల నీయవూ ॥విన॥

6) సీతామహాలక్ష్మీతోడ శ్రీరామచంద్రా!
సరగూనరావా నను బ్రోవగలేవా?
మీపాద సేవకుని శ్రీనివాసునీ
మొరవిని వేవేగ కరుణించలేవా? ॥విన॥



## కీర్తన

### (ఏనాటికైనా ఈమూగవీణ వరుస)

పల్లవి : ఏనాటికైనా ఈ జన్మ నుండి
రక్షింపరావా శ్రీ సద్గురేంద్రా॥

1) ఏజన్మపుణ్యమో ఈజన్మయందు
నీపాదసేవే సిద్ధించెనాకు
కరుణింపరావా కరుణాసముద్రా
వేవేగ నన్నుబ్రోవగ లేవా ॥ఏనాటి॥

2) పిండాండమందు జీవుడు నీవే
బ్రహ్మాండమందు దేవుండ నీవే
నీవులేనిచోటు నే చూపగలనా
భక్తవశంకరా బ్రోవగ రావా ॥ఏనాటి॥

3) జన్మమరణ వ్యథలోనే మునిగినాను
కర్మనిర్ణయమందు కట్టుబడినాను
జన్మకర్మలు బాపు స్వామివిగావా
శాశ్వతంబుగా నన్ను కడతేర్చ లేవా ॥ఏనాటి॥

4) మూలమేమి లేని నా నిజరూపు
తెలిసీన చాలని భ్రమచెందియుంటి
బట్టబయలునందు ఈ రూపుచూడ
రజ్జుసర్పము రీతి తోచెను నేడూ ॥ఏనాటి॥

5) భ్రాంతి రహితము జేయ ప్రభుడవు నీవే
జన్మకర్మల భ్రాంతి సమయింపరావా
తను మనధనములు ధారపోసితిని
నను బ్రోవనీకు భారమాస్వామీ ॥ఏనాటి॥

6) శ్రీరామచంద్రా సీతామనోహరా
సాక్షత్కరింపవా సంసృతి బాపా

నీపాదసేవకుడ, శ్రీనివాసుండనూ
పరిపరివిధముల ప్రార్థింతుస్వామీ ॥ఏనాటి॥



# శ్రీ గురు కరుణాంతరంగ

(శ్రీకర కరుణాలవాల వేణుగోపాలా వరుస)

పల్లవి : శ్రీగురుకరుణాతరంగ జేరరావయ్య
హృదయపీఠి నిలచి యెపుడు నేలుకోవయ్యా॥

1) ఎన్నెన్నో యోనులందుల యెన్నెన్నో జన్మలెత్తి
ఎన్నెన్నో యిడుములుబడి యేడ్చిగాసి జెందినాను॥శ్రీగురు॥

2) ఈషణత్రయమింటియందు, వాసినత్రయంబు బయట
బంధించీయుంచె నన్ను, ప్రభురాయ నీవేదిక్కు ॥శ్రీగురు॥

3) సర్వమందు లోనబైట సంపూర్తిగ నిండియున్ననిను
గాంచుటకు మనస్సు నిల్వదేమి పాపమో ॥శ్రీగురు॥

4) జన్మకారణమేదొ జూపి సమయింపుము దాని
మొదట భవహరుడ వనెడి కీర్తి వసుధ పరిఢవిల్లగా
॥శ్రీగురు॥

5) కర్మఫలము లంటకుండ కర్తృత్వము వీడుమంటి
వట్టిశక్తిగూడ నిచ్చి ఆదుకొమ్ము ప్రాపునీవే ॥శ్రీగురు॥

6) వాసిగా నరసాపురిలో వెలుగు భక్తవల్లభా
శ్రీనివాస సన్నుత శ్రీరామచంద్ర ప్రభువరా ॥శ్రీగురు॥



# కీర్తన

(తల్లినీ తండ్రినీ నీవే మమ్ములాలించి పాలింపరావా అనువరుస)

పల్లవి : గురువువు, దైవము నీవే
మమ్ము కాపాడి రక్షింపరావా స్వామీ ॥గురు॥

1) ఘోర సంసార వారాశిలోను
మునిగి తేలుచూ తల్లడిల్లుచున్నాను
నాదు వెతలు తీర్చి నన్ను కరుణించి
శాశ్వతంబుగా బ్రోచి దరిచేర్చుకోవా ॥గురు॥

2) శుద్ధ చేతనమూర్తివి నీవేగావా
సృష్టికర్తవు భోక్తవూ నీవేగావా
జీవశివులుగాను, నేను మేనుగాను
పరిణమించి భ్రాంతిముంచు స్వామి నీవేగావా ॥గురు॥

3) నిన్ను కనరాని చోటు కానరాదు
స్థూల సూక్ష్మముగా వ్యాప్తి చెందినావూ
శక్తి ద్వయముగా, పురుషద్వయముగా
ఉండీ ఉండక నీవు ఉనికి కల్గియున్నావూ ॥గురు॥

4) నీవు నాయందూ నిండియున్నావూ
నేనునీయందు మెలగుచున్నాను
బట్టబయలునందు మనస్థితిని చూడ
మూలయేమి లేక నే మాయమై పోయెను ॥గురు॥

5) భ్రాంతిమూలంబు నీవై యున్నావుగా
భ్రాంతి స్థానంబు నీవై యున్నావుగా
నాదు భ్రాంతి తీర్చి శాంతినిచ్చు ప్రభుడవు వీవే
నేను లేని పూర్ణమును వేగ దెల్పరావా ॥గురు॥

6) శ్రీ సీతామహలక్ష్మి తోడ రామచంద్రా
కరుణాంతరంగ కాపాడ రావా
నీపాద దాసుండ శ్రీనివాసుండనూ
తనుమన ధనములు వీడి శరణంటినయ్యా ॥గురు॥



# కీర్తన

("సఖియా వివరింపవే" అను వరుస)

పల్లవి స్వామి దయచేయవా
నీపాదదాసుని బ్రోవగా

1) నీరూపుచూసి నిన్నెధ్యానించి
నామనసును నీయందునిలిపి
ఘడియయైన వీడలేక
నిరతము నిన్నె భావింతును ॥స్వామి॥

2) సాధనలన్నియు చేసితిగాని
నామూలమును గానలేనైతి
జన్మకర్మల భ్రాంతివీడలేక
నీపాదపద్మములె శరణంటిని ॥స్వామి॥

3) తల్లీ, తండ్రీదైవమునీవే
నాదు కోర్కెను తీర్చగరావా
పుణ్యపురుషా నన్ను బ్రోవ
జాగేల వేవేగ కరుణింపవా ॥స్వామి॥

4) శబ్దాది విషయపంచకమందు
తగులుకొనీ తపియించుచుంటి
ధ్వన్యాదులులేని పరిపూర్ణమును జూపి
లేనెరుక లేదనుచు లెస్సదెల్పగా ॥స్వామి॥

5) మంగళకరమౌ నీపదయుగళము
నిరతంబు సేవింప జన్మభ్రాంతి తొలుగు
చరమ లక్ష్యమైన నీ కృపను బడసి
కర్తృత్వ త్యాగంబు చేకొందును ॥స్వామి॥

6) శ్రీ రాజయోగీంద్ర శ్రీరామచంద్ర
కరుణామృతవృష్టి కురిపించు దేవ
నీ పాద సేవకుని శ్రీనివాసుని
కాపాడి వేవేగ బ్రోవరావా ॥స్వామి॥



# గరుడే పరుడని దలపోసి

(కీర్తన)

("నీవని నేనని దలచితిరా" అనే వరుస)

పల్లవి : గురుడే పరుడని దలపోసి
గురుమూలము దరిజేరా

అనపల్లవి : కాదని గురుడే కసరి పొమ్మన, నీపాదములే
విడననుమూ ఏదో తెలియని బాధనమూ। ॥గురు॥

1) ఛీపొమ్మన్నా చింతించకనూ సిగ్గును వదలీ,
సేవించు జనన మరణముల ఋుడుపుదీర్చురా ॥గురుడే॥

2) ఎరుకనయేదో బయలనయేదో ఎరిగించెరుకను
హరియించునురా, ఎరుకతో భ్రాంతులు వీడిపోవురా ॥గురుడే॥

3) తనువుకు మూలము తానేనన్న తనువే తనకు
మూలమురన్నా, తనువుతాను ఒకటేనన్నా ॥గురు॥

4) తననువీడి తానేమౌనో తనులేకున్నా
తనువేమగునో, ఉన్నదిగన్నచో రెండేమౌనో ॥గురు॥

5) వున్నదానిలో లేకనె వుంటివి, అన్నాగురుని చెవు
న్నది గంటే కలవలె సర్వము కరిగిపోవులే ॥గురు॥

6) నారాయణుడూ నమ్మిభజించే, సుబ్బరాయ గురు
చూచి బ్రోచినా, నిజగురు పొన్నాల్ రాజ్వేరుడను ॥గురుడే॥

# ఇదియే నిజగురు బోధా

(కీర్తన)

పల్లవి : ఇదియే నిజగురు బోధా, ఇదియే జన్మవిముక్తీ ॥

1) **పుట్టుచు గిట్టే** యెరుకకు మూలం, బట్ట బయలులో
లేదని తెలియక, వట్టియాశలే బెట్టుకొంటివి, పుట్టవు
చావవు పూర్ణ బోధగను ॥ఇదియే॥

2) ఏమో లెమ్మని యభిమానముతో, యేబోధైనా
**యొకటేననుకొని యట్లేకాలము వృధా** జేసితే
బట్టబయలుగనకున్న భ్రాంతిపో ॥ఇదియే॥

3) కలయే నిజమని తలసోసెదవా, కలమేలుకలో కను
గొనగలదా? కలమేలుకలీ రెండూ కలయని,
**నిజమేల్కొ నెరిగించేటిది** ॥ఇదియే॥

4) మంత్రసిద్ధితో మహాత్ములైనా, మతవాదనలో
అతిరధులైనా సతతము గురునితో చర్చజరిపినా,
నిజస్థితి తెలియక తికమకపడుదురు ॥ఇదియే॥

5) అందరు బయలే అంటున్నారూ, అందరనేది ఆ వరణంబే
బయలుగాని, నిజబయులును దెలసీ బయలు
శూన్యమని సూచించేటిది ॥ఇదియే॥

6) విన్నాడూ నారాయణరావూ కన్నాడంకము
సుబ్బారావుచే పొన్నాలా రాజేశ్వరు బోధచే
బొందిరిర్వురూ భ్రాంతిరహిత స్థితి ॥ఇదియే॥

# పరిపూర్ణ గురుజేరి ప్రార్థించినా

(కీర్తన)

(కనుపాప కరువైన కనులెందుకూ వలె)

పల్లవి : పరిపూర్ణ గురుజేరి ప్రార్థించినా। మరుజన్మ రాకుండ
మాన్పించురా। మనకు మరు జన్మరాకుండ
మాన్పించురా

1) పుట్టు చావులయేట పడబోకురా! ఆయేటి
కొడ్డూలు గనరావూరా! గట్టిగ గురుజేరి గను
మార్గమూ! యీఘనమార్గమూ ॥పరి॥

2) విధివ్రాత కెదురీద లేమంచునా మదినెంచి
సోమారివై బ్రతికినా తుదలేద సంస్మరణ దుఃఖానికీ
జన్మదుఃఖానికీ॥ ॥పరి॥

3) ఉన్నాది పరిపూర్ణమొకటేననీ విన్నావ గురునోట.
యీ మాటనూకన్నావ, లే నెరుక సున్నోనులే॥
గుర్తుండుసున్నోనులే॥ ॥పరి॥

4) కలముచ్చటలు భ్రాంతిగలిగించురా ? కలమేల్కలో
జూడకనరాదురాః మేల్కొన్న కలజగము
మిధ్యానురా॥ శుద్ధమిధ్యానురా॥ ॥పరి॥

5) శ్రీరాజయోగీంద్రు సేవింపరా యీరాజ మార్గమును
చవిజూడరా శివరామదీక్షితుల సిద్ధాంతమే

దివ్యసిద్ధాంతమూ పరమసిద్ధాంతమూ ॥పరి॥

6) సుబ్బా రాయేంద్రుల శిష్యూలురా ॥ నారాయణుడు
భార్య అంజమ్మయూ వినిబోధమర్మంబు గనినారురా॥
వేగగనినారురా ॥ ॥పరి॥



# గురుడు ఒక ఊరిలో

(కీర్తన)

(కోడి ఒక కూనలో వలె)

పల్లవి : గురుడు ఒక వూరిలో శిష్యుడొక వూరిలో నున్న
గాని మనస్సులందు నొకరినొకరు మరతురా

1) తల్లి తండ్రిదైవము తమగురుడేయను శిష్యులూ
కన్నబిడ్డకన్న మిన్నగాను జూచు గురువులూ వారే
గురువులూ - వీరే శిష్యులు వారి వీరి మధ్య
దూరమెంతయున్న శూన్యమే ॥గురు॥

2) మేనువేరులైన, వారినేను మాత్రమొక్కటే, గాన
జ్ఞానబోధదెల్పు ఘనుల హృదయ మొక్కటే,
పేరులు వేరులై వూరులు దూరమై యు న్నగాని
హృదయంబులు వీడియుండబోవులే ॥గురు॥

3) దరికిజేర్చి తనదు మూల మెరుకపరచు గురువులూ

తన్నుదాను దెలిసి గురునిదారి నడచు శిష్యులూ
వీరికి సాటియె వ్వారిక లేరులే వీరి బంధమెప్పటికిని
విడదు ప్రాణముండగా ॥గురు॥

4) వున్నదానియందు లేక వుంటివనుచు దెలిపెనే లేని
నీవు దానిజూడ లేనెలేవు పొమ్మనే కలలో దోచినా
జగము లేదు లేదులే కళిక కర్పూరములు రెండు
గలసి వెలగి పోవులే ॥గురు॥

5) పొన్నాల రాజయోగి సన్నిధానమందునా విన్నబోధ
దెల్పి సుబ్బరావు గురుడు వేడ్కతో నారాయణ
వినుమనీ నాకుదెల్పి నట్టిదీ యొరులు వినగ జెప్ప
బూని యూహ జేస్తి నిట్లనీ ॥గురు॥



# గురుడుదెల్పి చూడమన్న బయలులో

(కీర్తన)

("కనులలో కనుపించే వలవులూ" వలె)

పల్లవి : గురుడు దెల్పి చూడుమన్న బయలులో
శిష్యుడెరిగి చూచేనట్టి చూపులో
ఎరుకా లేదని మరుపుకాదనీ
యిట్లాదెలుసుటే అదేమేలుక ॥గురు॥

1) కలయననేదో, మేలుక ఏదో కలమేల్కలుగానిది.
ఏదో చావో, నిదురో, వచ్చినదాకా, సేవించడమే
ధర్మముగా ॥గురు॥

2) అన్నియు తానైనట్టి యెరుకయే అచలమునందున
లేదనెగా లేనిబయలులో, లేక జూచితే వున్నదె
అంతట వుండెనుగా ॥గురు॥

3) బయలన యిదియేనని, దలపకుమీ
బయలును యిది అది అనరాదు ఎరుకాబయలే
మరపుబయలే, యివిగానిది లేనిది బయలు ॥గురు॥

4) అశరీరంబె సర్వదా ఆస్థి, సశరీరంబే నాస్తి సర్వదా
అని గురువాక్యము ధృడమైతే నీకంతే చాలును
బ్రాంతితీరగా ॥గురు॥

5) బయలును దెలిసే భావము మరచీ, గురుని వీడుట
సరికాదు, తల్లియు తండ్రీయు దైవమే గురుడని
తలపోసితివా, ధన్యుడవే ॥గురు॥

6) దేశికునోట దెలిసినమాట వ్రాసెను నారాయణుడీ
పాట, అతని గురుడౌ సుబ్బారావును బ్రోచిన
పొన్నాల్ రాజయబాటా ॥గురు॥



# తెలియరా నీ వెంతనిజమో

(కీర్తన)

పల్లవి : తెలియరా నీ వెంత నిజమో గురుని,
కలయురా, తెలియంగ నిజమో

1) కలలోన చుట్టాలిగని సంతసించావు
కలలోనే పెండ్లాడి కన్నావు బిడ్డల్ని
కలమేలుకొనిజూడ గనలేక పోయేవు
కలలో సంతతి కొరకు కన్నీరుగార్చేవు ॥తెలి॥

2) భయమంది త్రాటినే పామంచు భ్రమ సేవు
భయముతో మాంత్రికుల రయముగా బిలచేవు
తెల్లవారగ భ్రాంతి దీరిపోయెను పాము
గల్లంతు వుళ్ళుక్కి గనుము నీవారీతి ॥తెలి॥

3) యెండమావుల నీళ్ళ కెళ్ళేవు దెలియక
యెంతదవ్వేగినా ఎదుటెదుటె తోస్తుండె
యింతలో సూర్యుడు మింటిదిగి పోయేడు
యెండమావులనీళ్ళు యెందేగె నీవట్లె ॥తెలి॥

4) వున్నాది పరిపూర్ణ మన్నాదియని దెలుసు
కున్నావ? దానందు నున్నావో లేవోను
తిన్నగా యీగుట్టు దేశికేంద్రులచేత
కన్నావ? యదెమేల్క సున్నొర నీమాట ॥తెలి॥

5) కళిక కర్పూరాలు కలిసె వెల్గును గదా
వెలిగెపోయిన మీద యేముందో చూసావ
వెలిగించి యీసారి నిజము దెలుసుకో
తీసివేయుటకింక తెలివి మిగిలెందేమొ ॥తెలి॥

6) శ్రీ రాజయోగీంద్రు సేవించి మనసార
యీరాజ మార్గమును యింపుగా వినికన్న
సుబ్బారాయేశ్వరుల శిష్యుండనగునాకు
నారాయణాయని ననుపిలిచె వినిపించె ॥తెలి॥



# గురుమూర్తి గనలేని గురులెందుకూ

(కీర్తన)

(చిరంజీవుల సినిమాలో "కనుపాప కరువైన కనులెందుకూ వలె)

పల్లవి : గురుమూర్తి గనలేని గురులెందుకూ
దరిచేరి వినలేను తనువెందుకూ
గురిలేని హరినామ స్మరనెందుకూ
పరబయలు గనలేని బ్రతుకెందుకూ

1) కలలోన గనుపించు కరి మేల్కలో
కనరాదు యనిదెల్పు ఘనబోధనూ
వినిగురుని దరిజేరికను సంజ్ఞలో
మనలేని శిష్యుల మతులెందుకూ ॥గురు॥

2) బయలెరుక లెరిగించు ప్రభువూలచే
బయలెరుగు నీ జన్మలయ మేనులే
నీతో వచ్చిన జగము నీతోడనే
ఏ తీరు లేకుండునది తెలియగా ॥గురు॥

3) నీవు, జగమూ రెండు వేరన్నచో
నీతో వచ్చినదేగ యీ సర్వమూ
జగమూతౌ జనియించు నీయాటలూ
లేకున్న కనరావు నీపాటలూ ॥గురు॥

4) నీ తెలివి తెల్లారనన, లేవనీ
లోకోక్తి వినలేదే ? నీకోసమే
నివు నిజమని జగము మిధ్యనుటకూ
నీకెట్లు నోరాడె ? నిది తెలుసుకో ॥గురు॥

5) బట్టబయలుగ నేను వున్నాననీ
మిట్టిపడకుము నీవు సున్నేనులే
నీకుమూలములేదు నిజబయలులో
లెక తోచిన నీవు, ఏకాకివి ॥గురు॥

6) అశరీరి పొన్నాల రాజేంద్రునీ
శిష్యుడంకము సుబ్బరావేందుకూ
శరణన్న నీజన్మ చరితార్థమూ
నారాయణుడు గనెను బోధార్థమూ ॥గురు॥



# దేవా ననుబ్రోవమా ?

(కీర్తన)

(జననీ శివకామినీ వలె)

పల్లవి : దేవా, ననుబ్రోవవా! భవసాగరమును
పారదోలవా ॥గురు॥

1) నమ్మితినిన్నే, నాదైవముగా, పొమ్మనియన్నా
పొవగజాలా కమ్మని నీపద కమల సేవయే,
యిమ్మాస్వామీ యికనిను విడువా ॥గురు॥

2) దేహమునీవే, దేవుడనీవే యిహపరసాధన కిలవేల్పు
నీవే మోహబంధముల మూలమునీవే అహమును
బుట్టించి హరియింతువీవే ॥గురు॥

3) లోకాలేలే, లోకేశులెల్లా, నీశక్తిలేకున్న నిలుచుటే
కల్లా ఏకాలమందైనా చీకాకుగొన్నా లోకాలు
లోకేశులూగాడిపోరే ॥గురు॥

4) నీ రూపుగనుకోర్కె నిబిడమైయున్నా నీధ్యాన్నమే
జేయు నిష్టలో నున్నా నీనోట నిజబోధ నెరుగాక
యున్నా గనలేరు నీరూపుకలలోనైనా ॥గురు॥

5) హృదయమందుననిల్చు యీశుడవీవే, వెలుగులకెల్లా
వెలుగునీవే వన్నెలన్నియు మీరియున్న వస్తువు
జూప గురు బోధలో గురుడవునీవే ॥గురు॥

6) శ్రీ పోన్నాలా రాజయోగినీ సేవించెడి శ్రీ సుబ్బ
రావుగా నారాయనుడూనమ్మి భజించే స్వామివి
నీవే సద్గురుమూర్తి ॥గురు॥



# తరుణము మించినదారి దొరుకదు

(కీర్తన)

1) తరుణము మించిన దారి దొరుకదూ త్వరపడుమో
నరుడా గురుజేరగ త్వరపడుమోనరుడా
తీరిక యనునది బ్రతికినంతలో తెలియుము, లేదికరా
ఏరికి తెలియుము లేదికరా ॥తరుణము॥

2) కాలామాగకా గడచిపోవుటా - కనుచుంటివి గదరా!
ఏలా నీవిటు ఆలసింతువూ - ఎపుడో దేహమువీడి పోదువూ
॥తరుణము॥

3) వచ్చినప్పుడూ తెచ్చినదేదీ - చచ్చిన నీతో వచ్చున
దేదీ పిచ్చి భ్రాంతిలో పడి చెడిపోకా - వచ్చీ
గురునీ పదముల వ్రాలరా ॥తరుణము॥

4) ఇహమన కలయే, పరమన కలయే, యీ కలగాంచూ
నీవూ కలయే,
యీ కల గురునిచె మేలుకొంటివా, యిహ పర
భ్రాంతులు వీడిపోవురా ॥తరుణము॥

5) గురువే తల్లీ గురువే తండ్రి, గురువే దైవంబని, గురు
తెరిగీ గురునిచేత నీగుట్టు దెలిసితే మరల పుట్టవూ
మరణమొందవూ ॥తరుణము॥

6) అన్నా కన్నుల ముందర దైవమూ అంకం సుబ్బా
రాయుడే తిన్నగా నారాయణరావుకు తెరువుజూపినా
ప్రభువని దెలసీ ॥తరుణము॥

---

# అప్పటికీ ఇప్పటికీ యెంతో తేడా

(కీర్తన)

పల్లవి : అప్పటికీ ఇప్పటికి యెంతో తేడా
తప్పక యాత్రోవజనీ దరిచేరుము మానవుడా

1) శతవత్సరములన్నా బ్రతికిన వారంతా
గతిగానక జీవించిన కాలము అనాడూ
బ్రతుకంటె భ్రాంతిలేక, మృతియంటె భయములేక
ప్రతి లేని గురుబోధ స్థితిచెందెరు నేడూ ॥అప్ప॥

2) సాధనంబు లెన్నెన్నో సాధించిరి నాడూ
సాధనబాధే లేకను బోధించిరి నేడూ ॥అప్ప॥

3) బాధలెన్నో బెట్టి గురువు బోధించెను నాడూ
బోధజేత మనస్సు మార్చి సాధించెను నేడూ ॥అప్ప॥

4) జాతి కులా భేదంబుచేత జనిరి నాడూ
నీతియుండుటే గొప్ప జాతి యనిరి నేడూ ॥అప్ప॥

5) మత దురాభిమానముతో భ్రమ్గిరి యానాడు
ఆ అభిమాన రహితమెంతొ అవసర మీనాడూ ॥అప్ప॥

6) వున్నది యెరుగక లేనిదె వుందని రానాడూ
వున్నదేదొ వుందనుచును వుండజూపిరి నేడూ ॥అప్ప॥

7) దీక్షితీయ పీఠమునా తేజరిల్లు బోధా
రక్షించూ జనన మరణ భ్రాంతిరహితమీ బోధా ॥అప్ప॥

8) పొన్నాల రాజేశ్వరుడెన్నాళ్ళుగానో
తిన్నగ యీబోధ దెల్పుచున్నాడూ నాడూ ॥అప్ప॥

9) అంకం సుబ్బారావు పొందె నీతనినుండి బోధా
శంక లేక నారాయణు జేర్చి చెప్పెబోధా ॥అప్ప॥



# ఏవూరునున్నావో శ్రీ గూరుదేవ

(కీర్తన)

పల్లవి : ఏవూరునున్నావో శ్రీగూరుదేవ
మావూరు మదిలోన మరిచేవ రావ

అనుపల్లవి : నీరాకకై యెదురు చూచేటి కళ్ళూ
కారేటినీలాల పూచేనుపూలు

కనుదెరచి కనుమూసి కలజెంది మనసూ
కనరాని నీమాట వినగోరి యుండే ॥ఏవూరు॥

1) తినుచున్న అన్నంబు దినదాయె మనసూ
ప్రాణంబునీరైన త్రాగకనె విడచూ
యీరీతి దాగుండగా నేమి మనసో
తలుపులు పాములై తరిమి తరిమి కర్రచూ ॥ఏవూరు॥

2) యేవూర గలవంచు యెందు వెదకూదూ
యేవూర లేవంచు యెడ బాసిపోదూ
అన్ని వూరుల యందు నున్నావు నీవే
అన్నివూరులె నీవె అయినావు దేవా ॥ఏవూరు॥

3) దొరికేవు నాకింక నీవెందుచేతో
ననువీడి నీవెందు పోతావొ చూతూ
నాహృదయమున నీకు ఆసనంబిస్తా
కదలీన పదమూలు గట్టిగ పడతా ॥ఏవూరు॥

4) తను మానధనములు నీవేగదయ్యా
నీకీయ నావద్ద యేమున్నదయ్యా
యేమిలేదని నన్ను విడనాడకయ్యా
నేనున్న, ధక్షిణగ గైకొనుమయ్యా ॥ఏవూరు॥

5) పొన్నాల రాజేంద్రు బూజించుచుండ
సేవింతునిన్నెపుడు సుబ్బరాయుండ
అన్నయ్య యగు రామచంద్రయ్య తోడ
నారాయణుని వూర నీవుండరాదె ॥ఏవూరు॥

# పాడుతా లేనిదీ లేదనీ

(కీర్తన)

(పాడుతా తీయడా చల్లగా అనేమాదిరి)

పల్లవి : పాడుతా లేనిది లేదనీ, పాటవినుచు మైమరచి
పవ్వళించు దేశికా పాడుతా లేనిదీ లేదని

1) ఈడులేని బయలులోన యెరు కలేదనీ
జోడుగూడి యెరుకతోడ జూడలేమనీ
తోడనీడ లేనియెరుక వీడిపోననీ
ఘడియ నిలువుకొందుమన్న నిలువదిదియని ॥పాడుతా॥

2) ఎన్నొజన్మలెత్తుజీవి వేషధారనీ
వున్నదాన్ని గన్న జన్మలింక లేవనీ
గురునిచేత మరుగు తెలుసుకొన్న వారలూ
తిరిగిపుట్టరనుచు దెలిపె దేశి కేంద్రులూ

3) పూర్వకర్మ ననుసరించి బుద్ధిపుట్టునూ
బుద్ధిపుట్టినటులె పనులు చేయుచున్నచో
తెంపులేక జన్మలెత్తి తీరవలెనయా
కర్మబంధ మెప్పటికిని కాలిపోదయా ॥పాడుతా॥

4) కాలమాగకుండ నెపుడు గడచి పోతది
దెలియకుండ దేహమెపుడొ కూలిపోతది
తెలివి దేహాలున్న యపుడె దేవునెఱిగితే
కాలచక్ర గతిని దాట గలుగనేర్తుమూ ॥పాడుతా॥

5) మేడిపండు రంగుచూడ మేల్మి బంగారం
పొట్టవిచ్చి చూడ లోన క్రిముల బండారం
పట్టి చూడ యెరుకరీతి యిట్టిదేనయా
గుట్టు దెలసి చూడ మిగులు బట్టబయలయా ॥పాడుతా॥

6) కోరివచ్చు నారాయణు కోరికదీర
సుబ్బరాయ గురుడు దొరికె సుకృతంబున
పొన్నాలా రాజయోగి పూర్ణభావమూ
దెలిసినంత పాటపాడి తేటపరతునే ॥పాడుతా॥

# ఎన్ని జన్మలెత్తిన

(కీర్తన)

పల్లవి : యెన్ని జన్మలెత్తి నా విసుగులేదు యెరుకకూ
వున్నదాన్ని తెలుసుకున్న సున్నయౌదునని భయము

1) బాధగల్గ పూర్వజన్మ ఫలితమిదే నంటదీ
బాధలేక సౌఖ్యమబ్బ ప్రజ్ఞనాదే నంటదీ
బాధ సౌఖ్యములతోడ బ్రతికి చస్తూవుంటదీ
బాధలేని బోధ తెలుప బాబోయ్, నిల్వనంటది ॥ఎన్ని॥

2) మళ్ళీ జన్మమందు యేదో మంచి సుఖమె వుందనీ
కోర్కెతోడ జన్మలెత్తి, కుమిలి కుమిలి చస్తదీ
స్వర్గలోక ప్రాప్తికీయ యజ్ఞానులేవా చేస్తదీ
పుణ్యము క్షీణింపగానె భూమిమీద పుడతదీ ॥ఎన్ని॥

3) ఈషణత్రయాల జిక్కియంతొ ఆశపడతదీ
వినుగుజేంది సతీ సుతుల విడచి పారిపోతదీ
అడవిలోన కూరుచున్న ఆలినే స్మరిస్తదీ
స్థితిని నేర్పు గురుడు లేక వెతలుచాల పడతదీ ॥ఎన్ని॥

4) ఊరే అచ్చిరాదంటె వేరేయిల్లు చూస్తదీ
జన్మదోషమంటె మంచి జన్మకోరు కొంటదీ
శృంఖలాలు పసిడివైతె శృంగారములంటదీ
పసిడివన్నె మిసమిసలకు భ్రాంతి జెందియుంటదీ ॥ఎన్ని॥

5) బాల్యమందు ఆటలందె మరగి ఆడుకొంటదీ
యవ్వనముల గురునిబోదయంటె యేవగిస్తదీ
ముదిమియందు బోదవినగ మనస్సునిల్వనంటదీ
పూర్వజన్మ మందు పెట్టిపుట్టలేదనంటదీ ॥ఎన్ని॥

6) యోగపురుషుడైన రాజయోగికి పూజసల్పనా
ఆతని శిష్యుడైన సుబ్బారావు గురుని చేరనా
చెంత నారాయణతొ వుండి వంతపాట పాడనా
గురుని శరణు పొంది లేనిగుర్తు వీడియుండనా ॥ఎన్ని॥

## కీర్తన

పల్లవి : అన్ని జన్మలకన్నా మనలో అధికం ఏముందీ ?
అన్నిటి నెరిగి అర్థము దెలిసే ఆలోచన వుందీ,
మనలో ఆలోచన వుందీ ॥అన్ని॥

1) వున్నా తెలియక, తింటూ త్రాగుచు, వుంటారెవ
రండీ? రెండు కాళ్ళతో వుండేమానన పశు వంటా
రండీ! వానినె పశువంటారండీ ॥అన్ని॥

2) పశువుల మానవ పశువుల మధ్యను హీనులెవ్వరో దెలు
పండీ పశువులకంటెనూ హీనము మానవ పశువేయనుచూ
నెరుగండీ! మానవ పశువేయనుచూ నెరుగండీ ॥అన్ని॥

3) పశువే మేలనీ పలుకుట యేలనొ బాగుగ వివరించండీ
మనుజుల నిట్టుల హేళనచేయుట మర్యాదగన్గూ లేదండీ
ఏమియు మర్యాదగనూ లేదండీ ॥అన్ని॥

4) ధర్మాధర్మము లెరుగని దయ్యును, ధర్మము తప్పదు
**పశువండీ** ధర్మాధర్మములెరిగి, స్వధర్మము తప్పును
మానవ పశువండీ కనుకనె మానవ పశువండీ ॥అన్ని॥

5) కర్మల ఫలితము కల్గెడుపట్లను భేధములేమో తెలుపండీ
పశువుకు అంటదు ఫలితంబంచు పల్కుదురేమండీ
పెద్దలు పల్కుదురేమండీ ॥అన్ని॥

6) సంచిత ప్రారబ్ధంబులు రెండూసమమే రెంటికి **దెలియండీ**
ఎరుగకచేసిన కర్మ ఫలంబులు ఏమియు నంటవు తెలి
యండీ పశువును ఏమీ అంటవు తెలియండీ ॥అన్ని॥

7) జన్మరహితమూ పొందగ పశువుకు సాధ్యమోకాదోతెలు
పండీ కర్మత్రయమే **అగ్నిచేతను కాలిపోవునో** దెలుపండీ
జన్మము కూలిపోవునో దెలుపండీ ! ॥అన్ని॥

8) మానవుడయ్యా గురుదజేరి మార్గమెరుగ వలెనూ
జ్ఞానముచే కర్తృత్వ రహితుడై కర్మ చేయవలెనూ
చేయక చేయుచుండవలెను. ॥అన్ని॥

9) రాజయోగికి పూజసల్పును గురుడు సుబ్బారావూ
అతడు దెల్పగా వినెను సర్వమూ నారాయణరావూ
అట్లేదరికి జేరగలవూ అప్పుడెదరకి చేరగలవూ ॥అన్ని॥

# అక్క చెల్లెండ్ర గురు సంకీర్తనము

(కీర్తన)

(నల్లవాడే అమ్మమ్మ అల్లరి పిల్లవాడే వరుస)

పల్లవి : అక్క : లేనివాడే నిజమమ్మ లేకనే తోచినాడే
చెల్లి : వున్నవాడే యందరి కోయక్క అందుతాడే
అక్క : లేదమ్మ లేదులే శిష్యులకె చిక్కుతాడే
శ్రీ గురుడు లేకనే దోచినాడే ॥లేని॥

1) అక్క : తల్లి దండ్రి లేక వచ్చి యున్నవాడే
చెల్లి : భార్య బిడ్డలతో కూడి యున్నవాడే
అక్క : సేవచేయు వారలనె చేరుతాడే
చెల్లి : భక్తి గొల్చు దాసుల పాలించువాడే ॥లేని॥

2) అక్క : స్వార్థబుద్ధి యేమిలేని స్వామి యాతడే
చెల్లి : ధన ధాన్య సంపత్తి కతడు దాసుడుగాడే
అక్క : ఈశుడు రామేశుడు కాశీపురాధీశుడువాడే
చెల్లి : సృష్టికి పూర్వంబెయున్న శుద్ధమూర్తి యాతడే ॥లేని॥

3) అక్క : కలబాసి మేల్కనూ గన్నవాడే
చెల్లి : కలవారి కన్నులలో కదులుతాడే
అక్క : మేలుకొన్ని వారికి మేల్కవాడే
చెల్లి : లేదమ్మ మముపీడ లేనివానిడే ॥లేని॥

4) అక్క : మంచివాడని మరచియుంటె ముంచుతాడే
చెల్లి : ఎడతెగని భక్తి చేస్తె యేలుతాడే
అక్క : నీకు మూలయేమియంటె నేనెయంటాడే
చెల్లి : నేను లేకపోతే తాను లేకయుంటాడే ॥లేని॥

5) అక్క : అన్ని రూపులైన ఇంద్రజాలకుడతడే
చెల్లి : అన్నిటిలో దాగియున్న ఆత్మ యాతడే
అక్క : చూడబోతె బట్టబయట శూన్యమాతడే
చెల్లి : అవునమ్మ పొన్నాల రాజయోగి యాతడే ॥లేని॥

6) అక్క : యోగి భోగి రెండూగాక వున్నవాడే
చెల్లి : రాజయోగ రీవితోడ రాజిల్లువాడే
అక్క : సుబ్బారాయ గురుడుచెప్పి చూపినాడే
చెల్లి : అవునమ్మ నారాయణు డంజలి ఘటించినాడే ॥లేని॥



# ఎవరుకన్నా రెవరు పెంచేరూ

(కీర్తన)

(ఎవరుకాన్న రెవరు పెంచేరూ నవనీత చోరుని వలె)

పల్లవి : ఎవరుకన్నా రెవరు పెంచేరు - ఎరుకనే బాలుని,
మరువనే శిశువును - ఎవరు పెంచేరు ॥ఎవ॥

1) తల్లిదండ్రీ లేక పుట్టి పుట్ట నీ కన్నియను బట్టి
పెండ్లియాడియు పిల్లలనుగని, ఎల్లలోకములేలు బాలుని
॥ఎవ॥

2) లేనిదే, మృగజలము వంధ్యాసూనుడై జనియించి తానే
నేను మేనులు, ప్రకృతి పురుషులు, గాను ద్వంద్వము
లైన వానిని ॥ఎవ॥

3) యెండమావుల రీతిగా నుండేటి బ్రహ్మాండము సర్వము
నిండియుండిన అచలమందున వుండకా వుండేటి
బాలుని ॥ఎవ॥

4) నీకు మూలంబేది యనినా నాకు నేనే మూలమనుచూ
లేక తోచిన స్వప్నమున యేకాకిగా వచ్చిన
బాలుని ॥ఎవ॥

5) పుట్టుచావుల యేటిలోబడి కొట్టుకొని పోయేటి సుజనుల
బట్టి యొడ్డున చేర్చగా చేపట్టినా పాన్నాల యోగిని ॥ఎవ॥

6) శంకరహితా పూర్ణబోధను గొంక కా శిష్యులకు
దెల్పియు శంకరదీర్పగ ప్రతినబూనిన అంకము గురు
సుబ్బారాయుని ॥ఎవ॥

7) "కంటివా నారాయణా మనముంటిమా, నిజ బయలు
లోపల? లేననీ మేల్కొంటె లేవిక చావు పుట్టుకలు"
అనెటి గురువును ॥ఎవ॥



# నీవుండి చూచేవ బయలూ

(కీర్తన)

పల్లవి : నీవుండి చూచేవబయలూ లేని నీవుండిజూచేవ
బయలు

1) నీవు బయలులొ వుంటె నిజమౌను నీమాట లేవు
బయలును చూడబోవ, నిలువగలేని ॥నీవు॥

2) నీకుదోచేదంత నిజబయలుగా, దెరుక లేక
జూడుము, నీవుగాకున్న దదె బయలు ॥నీవు॥

3) కల మేలుకను జూడ దలపోసి దలపోసి
మేల్కదరికేగితే మేటికలయేమౌను ॥నీవు॥

4) తిమిరంబు సూర్యుని తేజంబు దెసజూడ
కరగినిలువగ లేక విరిసి పోవునుగాదె ॥నీవు॥

5) పొన్నాల రాజేంద్రుచే బోధ విన్నాక వున్న
బయలులో యెరుక సున్నా తెలిశాక ॥నీవు॥

6) నారాయణంజమ్మ నమ్మి పూజించేటి
సుబ్బరాయుని బోధ సూక్తులు విన్నాక ॥నీవు॥

# యిది తరుణం బిది సుదినం

(కీర్తన)

పల్లవి : యిది తరుణంబిది సుదినంబిది గురుదేవుల
పూజాదినం ॥యిది॥

1) సద్గురు పదములు సన్నుతిచేసి షోడశోప చారాదుల
జేసి! మంగళంబు గురు దేవునకంచు పొంగి పొంగి
యానంద మొందగా ॥యిది॥

2) పూజచేసి గురు కృపకు పాత్రులై పూర్ణబోధచే
భ్రాంతిరహితులై జననమరణములు దొలగు మార్గము
ను వినయముతో గురుదేవునడుగగా ॥యిది॥

3) పట్టుకొన్న గురుపాదము విడకా ఘట్టిగాను
కరుణించెదనుకా! గుట్టుదెల్పి దరిచేర్చు భారమూ
యెట్టులైన నీదేనని వేడగ ॥యిది॥

4) అంతటనున్నది యచలంబనుచూ అందున లేదీ
యెరుకయటంచూ, అదియిది యనకను ఆశరీరుండై
యలరిన సద్గురునండ జేరగా ॥యిది॥

5) కలలోబంధువు లెందరొవచ్చి కలముచ్చట్లలో
మోదముహెచ్చి, కలతో నెగిరిబంధువులంతా, గురుని
చేత. కలమేల్కొ లెరుగగా ॥యిది॥

6) దేశికుండు పొన్నాల రాజయాదానుడైన శ్రీ
సుబ్బరావుకూ దోసిలొగ్గినారాయణరావు,
గాసిబాపు భారము నీదేనని ॥యిది॥

# మళ్ళీ మళ్ళీ వింటావ యీ పాటా

(కీర్తన)

పల్లవి : మళ్ళీ మళ్ళీ వింటావా యీ పాటా
లేననుకో నీమదిని నామాటా

1) భ్రాంతులు వుంటాయి ప్రతివారికి నిండ
బ్రతికిన నూరేళ్లు ఆనాటికి
విడువలెనన్నా వీడుదమన్నా
వీడవు బంధాలు నీవుండగా ॥మళ్ళీ॥

2) ఆశలు మదిలోన అరికట్టుకో గురుని
చే బోధగని మనసు నిలబెట్టుకో
అందరివలెనే అన్నిట పనులు,
లేకనే నీవుండి సాగించుకో ॥మళ్ళీ॥

3) నీ వెరుగ లేనట్టి నిజబయలులో
నీరాకపోకలు నీవెరుగవు
రాకడలేక పోకడలేని
ఏకస్థితి గురునిచే దెలుసుకో ॥మళ్ళీ॥

4) కలలోన ఏమేమొ గన్నావులే, మేలు
కొని యిది కలయంచు యున్నావులే,
నీకలమేల్క నీవూ నేనూ
లోకముతో లేక వున్నామనీ ॥మళ్ళీ॥

5) పానాల శ్రీ రాజయోగీంద్రుచే బోధ
గొన్నాడు శ్రీ సుబ్బరావేంద్రుడు
అన్నియు దెలిపి, వున్నదేవుంటే
లేనిది లేదనెను నారాయణా ॥మళ్ళీ॥

---

## శరణాగతి

(కీర్తన)

("చేతిలో చెయ్యేసి చెప్పు బావా" అనే విషాదపు స్టయిలు)

పల్లవి : శిరముపై చెయ్యుంచి చెప్పు స్వామి

1) తనకు తానె భస్మాసురుడు దగ్ధమైనరీతిగా
తిరిగిరాని బోధ నాకు తెలియజేతుననినాదు ॥శిర॥

2) పట్టుగొంటి పాదమూ గట్టివాడననుచునూ
గుట్టుదెలిపి నన్నా వలిగట్టు జేర్తునని నాదు ॥శిర॥

3) నేను లేని దేవుని, చూడ నేను లేనులే
లేనిచావు పుట్టుకలా భయము దీర్తునని నాదు ॥శిర॥

4) లేకపోదు నేననీ భయములేదు లేదులే
దీసుకొమ్ము వేగనాదు, తను మనోధనములా ॥శిర॥

5) నన్ను బ్రోవకున్న నిపుడు, నిన్ను వదలిపోనులే
చెప్పి రాజయోగితోడ శిక్ష నీకు వేయింతూ ॥శిర॥

6) ఆశబెట్టుకొన్న నీదు దాసుడు నారాయణుడూ
వ్రాసినాడు సుబ్బరాయ దోసమున్న దిద్దితీర్చి ॥శిర॥

# నిజదేవుడు

(కీర్తన)

(మరపురాని మనిషిలో ..... ఎక్కడో లేడు లేడు దేవుడూ వలె)

పల్లవి : ఎక్కడో లేడులే దేవుడూ
నువ్వెక్కడుంటె అక్కడే వున్నాడూ
ఒక్కసారి గురుజేరి వున్నమరుగు దెలిసితే
చిక్కులన్ని దీరిపోయి జన్మసఫల మవుతుదీ

1) వున్నవాడే దేవుడూ యెప్పుడూ
కాని నీ మొరాలకించడేమి యెప్పుడూ
లేనినీవు దేవునిలో లేకతోచియున్నావూ
కాన నిజదేవుని గనలేవు ముమ్మాటికి ॥ఎక్క॥

2) సర్వకాలముల యందూ వున్నాడూ,
సకల దేశములయందూ వున్నాడూ,
లోకంబుల లోకేశుల రాకడ పోకడలున్నా
ఏకాలము ఓక్కతీరు కదలకనే యున్నాడూ ॥ఎక్క॥

3) నీకు లోన బయట నిండి వున్నాడూ
నీవు తనలోనె వున్న దెరుగకున్నాడూ
ఎందరు లేదనియన్నా మందమతులు గనకున్నా
సందేహము లేదు లేదు సర్వత్ర యచలమేను ॥ఎక్క॥

4) కలవారికి మేలుకలో వున్నాడూ
మేలుకొన్న దగ్గరనే యున్నాడూ
కలమేల్కల రెంటిని గురుకరుణవల్ల దెలిసితే
తలచిచూడ యెరుకలేదు తొలగిపోవు భ్రాంతులన్ని ॥ఎక్క॥

5) పొన్నాల రాజయోగి యున్నాడు
పూర్ణబోధ నందర గనుమన్నాడు
సుబ్బరావు సూక్తులు విని సూటిగ నారాయణుడు
పాటించే ధర్మమిదే పరిహాసము చేయక విను ॥ఎక్క॥



# నీవుండేదావూరిలో

(కీర్తన)

రచన : చోడిశెట్టి నారాయణరావు గారు (మాజేరు)

పల్లవి : నీవుండేదావూరిలో, గురుదేవా, నేనుండేదీవూరిలో
యేవూర పూజింతురా, నాస్వామి ఏపేర
ధ్యానింతురా!

1) వూరులునీవే, పేరులు నీవే
గిరులన్నా నీవే, తరులన్న నీవే
నరులాది జంతుజాలములు నీవే
యేరూపమని నిన్ను కోరిభజియింతురా ॥నీవుండే॥

2) పిండాండమందు జీవుడనీవే
బ్రహ్మాండమందూ దేవుండవీవే
పిండ బ్రహ్మాండాలు రెండూను నీవే
దండీవాడ నీదు అండజేరుదమన్నా ॥నీవుండే॥

3) దేహాలునీవే, సందేహాలు నీవే
దేహివి దేహూల సోహాలునీవే
అహమూను బుట్టించి హరింతునీవే
వూహచే నిను తెలియ నొరులకుదరమౌన?

4) జ్యోతులునీవే, ఆపాజ్యోతూలు నీవే
గీతాయునీవే, పరంజ్యోతివినీవే
శ్రుతులందునీవే, స్మృతులందునీవే
యితిహాసములలోన వెతకీననీవే ॥నీవుండే॥

5) కలలన్ని నీవే, కలహాలు నీవే
కలలోన దోచే చిత్కళలన్ని నీవే
కలమేలు కొలిపేటి ఘనమైన బోధా
వినజేయ కనజేయ, వినుతి తునాధా ॥నీవుండే॥

6) వున్నదానిలో నేను వున్నానో లేనో
వున్నా దానిని జూడ నెన్నాళ్ళకౌనో
చూడబోయిన యెరుక చోద్యమేమౌనో
యిదిదెల్పి గడతేర్చు మింతెకోరిక సుమ్మి ॥నీవుండే॥

7) శ్రీరాజయోగీంద్రు సేవించునట్టి
సుబ్బారాయేంద్రూల పాదము పట్టి
పుట్టుచావుల మొదలు దెగగొట్టినట్టి
నారాయణం జమ్మ నమ్మి నినుగొల్వగా ॥నీవుండే॥

# భలేమంచిబోధ

(కీర్తన)

(భలే మంచి రోజు - పసందైన రోజు వలె)

పల్లవి : భలేమంచి బోధా - పసందైన బోధా పునర్జన్మ మాన్పే
పూర్ణ బోధా - పునర్జన్మ మాన్పే దివ్య బోధా

1) ఎరుక మరుపులుగానీ బోధా - ఏకమై తానున్న బోధా
గురునిజేరి శరణనువారికి - పరమపదమై వెలిగె బోధా
గురునిజేరి శరణు వారికి - పరమపదమై వెలిగేబోధా ॥భలే॥

2) విత్తెచెట్టై వెలసెడిరీతి - ఎరుకేజగమై ఏర్పడెనంచూ
"ఎరుకజగములు" ఎరుకకు బొమ్మా - బొరుసులంచూ
దెలిపేబోధా ॥భలే॥

3) వేదశాస్త్రములన్నిటిలోనా - వెదుకగనవచ్చే బోధా
సాంప్రదాయక గురువులనోటా - శాశ్వతంబుగ నిలిచిన
బోధా ॥భలే॥

4) నూతంబనరానీ బోధా, సనాతనంబై వెలిగేబోధా
ఎరుక భ్రాంతి వీడిన సుజనులు - చరమలక్ష్యంబైన
బోధా ॥భలే॥

5) మతములందున చేరనిబోధా - మితములో నణగుండని
బోధా అమితమితముల మీరియున్న - అచల బ్రహ్మమె
స్థిరమనుబోధా ॥భలే॥

6) భువిని శ్రీ శివరామదీక్షిత - పూర్ణ పురుషుడు దెల్పినద్ధీ
బోధా వాసిగా శ్రీ రాజయోగి - పరమదేశికుడెరిగిన
బోధా ॥భలే॥

7) అస్త్రములచే నొవ్వని బోధా - శస్త్రములు ఖండింపని
బోధా ఎండవానల, గాలులనలయక - ఎల్లకాలంబున్న
బోధా ॥భలే॥

8) దిక్కునీవని సుబ్బారాయుడు - దీనజనుడై వేడుకొన్న
కరము శిరమున శ్రీఘ్రమంచి - ఎరుక భ్రాంతినిమాన్పిన
బోధా ॥భలే॥



# "రాజయోగుల బాట నడవండీ"

(తత్వము)

పల్లవి : రాజయోగుల బాట నడవండీ - జనులార మీరు
రాజయోగి శరణు వేడండి ॥రాజ॥

అనుపల్లవి : రాజయోగిని శరణువేడీ - పూజచేసి మోదమలరగ
మనో వాక్కాయముల మూటిని - మాని తంబుగ
గురుని కిండూ ॥రాజ॥

చరణములు :

1) సాధనంబుల జోలి మానండి - జనులార జన్మ
బాధ దొలగదు వాటి వలనండీ
సాధనంబులె లేని పూర్ణ - బోధ సద్గురు చెంతజేరి
సవినయంబుగ విన్న కన్న - జనన మరణా భాధదీరు ॥రాజ॥

2) "బ్రహ్మ" వెలసెను "మాయ" గానండీ - జనులార
జూడ "బ్రహ్మ" "మాయ" లు వేరుగావండీ
"బ్రహ్మసత్యము, జగన్మిద్యా', - మాయదాటి బ్రహ్మమైతె
మళ్ళీ జన్మము లేనేలేదను - మాటవిన్నను మోసమౌను ॥రాజ॥

3) మతములందునజేరవలదండీ - జనులార ఉన్న
మతులు సైతము జెడును మనకండీ
శాస్త్ర సమ్మతియైన చాలని - స్వంత యనుభవమేమిలేకను
శాస్త్రతములనే త్రాళ్ళ చేతను - సర్వమతములు కట్టుబడియెను
॥రాజ॥

4) పుట్టినందుకు పుడమి యందూన - జనులార మరలా
పుట్టకుండెడి మార్గ మరయంటీ
పుట్టినందుకు గురుని పాదము - పట్టినందుకు జగతియందు
గురుగుహ్యమైనా "బట్టబయలూ" గోప్యమెఱిగి
మసలవలెను. ॥రాజా॥

5) "ఆరుకోశము" లంతరించూను - జనులార అంతా అచల
పూర్ణమె నిండి యుండూనూ
జననమరణాబాధ దీరూ - జ్ఞానకర్మల ముడియు సడలు
హృదయ గ్రంధిబేదనంబౌ - హృద్యమౌ సద్గురుని
కరుణతో ॥రాజా॥

6) భక్తజనముల "కొంగు బంగారై" - జనులారవారి -
భవము మాన్పగ భువిని వెలసీన
అచలఋషీ శ్రీ రాజయోగి" - అండజేరి భక్తి గొల్చి
ధరణిలోనా భ్రాంతి వీడిరి - నారాయణ సుబ్బారాయులు
॥రాజా॥



# కట్టులోనే వుండినారండీ (తత్వము)

పల్లవి : కట్టులోనే వుండినారండీ - అజ్ఞాన పరులు కట్టుదాటెడు
తెఱవుగనబోకా

అనపల్లవి : కట్టులోనే వుండినారని - బట్టబయలు వునికి దెలిపిన
"ఆత్మనోన్యం నకించన" యని ఆత్మయే మా కచల
మందురు ॥కట్టు॥

1) "అవాగ్మానస గోచరం" బనిరి - ఆ పర బ్రహ్మం -
బందుననిరీ శుద్ధ మనసునకు
మనసు కందెడిదెట్లు బ్రహ్మము ? - మనవి చేయుండనని
పలుకగ కోపమంతయు కూడగట్టుక - కొట్టుటకు
సంసిద్ధులగుదరు ॥కట్టు॥

2) మూడుపాదము లమృతంబనిరీ - ఆ పరబ్రహ్మదే - వొక్క
పాదము విశ్వమంచనిరీ
కొంత సత్యము కొంతమిథ్యగ - అంతటంతట పరిమితంబై
ఉండు బ్రహ్మం బచలమెట్లన - వున్నశృతికి భంగమౌనని
॥కట్టు॥

3) దీక్షితాచల సిద్ధాంత మున్నదీ - సనాతానంబిది - దీని
విన్నను జన్మలేదండీ
సర్వాభ్రాంతుల కునికియైన సాక్షి బ్రహ్మము కవలి బోధా
సత్యమిదియని మనవి జేసిన - చాలు మాకిది
పొమ్మటందురు ॥కట్టు॥

4) సత్యమార్గము జనవిరోధంబూ - అసత్యమార్గమె -
సర్వజన సంపూజ్యమానంబూ
ఆవరణ మెరుకయని నిరా - వరణము పూర్ణమనుచూ
వున్న బయలున సున్న యెరుకని - వున్న సత్యము చెప్ప
నమ్మరు ॥కట్టు॥

5) సికింద్రాపురం సీమయందునా - అనసూయనాధుడు
రాజయోగి గురువ రేణ్యుండూ
సాక్షి రహితంబైన బోధను చాటి చెప్పెను
వినుడురండను సుబ్బరాయుని పిలుపు వినకను -
మబ్బులోనే యుండువారలు ॥కట్టు॥



# జయము జయము మనకూ

(కీర్తన)

పల్లవి : జయము జయము మనకూ సద్గురు - దయ వుండేవరకూ
ఆధర్మ మడచీ ధర్మము నిలువగ - అవతరించె పర
మాత్మయే గురుడై

1) శరణని మ్రొక్కిన ఆర్తజనములా - శిరమున సరగున
శ్రీహస్తముంచీ ద్వాదశిషోడశి దివ్యవాక్యముల -
బోధపరచి భవబందముద్రుంచును ॥జయ॥

2) మూడు గుణములకు మూలముగానిది - మూడుకాలముల
బాధలు లేనిది మూడులోకముల వునికియె ఎరుగని
ముక్తికిపదము నేముందుగ జూపును ॥జయ॥

3) అణువు మొదలుగా మహోత్తు వరకూ అఖిలలోకములు
అన్నియు తానై అంతట నింతట గనపడు ఎరుకను
అనిత్యమనుచూ బోధజేయుగద ॥జయ॥

4) ఉన్నదిలేనిది, లేనిదె కలదని - వూహాగానములు జేసెడి
ఎరుకకు వున్న దానిలో మూలము లేదని వుత్తది ఎరుకని
భ్రాంతిదీర్చుగద ॥జయ॥

5) దాహశాంతికై మృగజలములగని, మోహంబున జను
మృగ తతిరీతిగ ఎరుక భ్రాంతిబడి మ్రగ్గుట వలదని
పరిపూర్ణాచల సూచనజేయును ॥జయ॥

6) నారదముని వరు పాదము సోకిన - నారాయణ సము
డయ్యెను వాల్మీకి సద్గురు చరణము సోకిన సుజనులు
జనన మరణముల సుడిబడరుర్విని ॥జయ॥

7) హరిహర బ్రహ్మ సేవితమంత్రము - అఖిలసురాసుర
పూజితమంత్రము సద్గురు మాలామంత్ర మహిమచే -
సద్గతి జూపును పురుషోత్తముడై ॥జయ॥

8) ధరలో సికింద్రాపురం వరమందున - పరమ భక్తజన
మందారుడు శ్రీరాజయోగి గురునమ్మిన సుబ్బా -
రాయుని జన్మ సఫలమాయెగద ॥జయ॥

# కీర్తన

(మంచివాడు మాబాబాయి అనేచాయ)

1) అందచందములు కలిగున్నా అందలముపై కూర్చున్నా
గురుడు మదిలో లేకున్నా ఎన్నున్నా అవిసున్నన్నా ॥అం॥

2) ధనధాన్యంబులు కలిగున్నా। దారాపుత్రాదులు వున్నా
నీమది గురుపై లేకున్నాః ఎన్నున్నా అవి సున్నన్నా ॥అం॥

3) పాడిపంటలు ఎన్నున్నా పదవులు ఎన్నో కలిగున్నా
దైవమెగురుడని యనకున్నా ఎన్నున్న అవి సున్నన్నా ॥అం॥

4) వేదశాస్త్రములు చదివున్నా వేషములెన్నో వేస్తున్నా
నిజగురు బోధను వినకున్నా ఎన్నున్నా అవి సున్నన్నా ॥అం॥

5) మణులూ మాణిక్యములున్నా మాటలు ఎన్నో కలిగున్నా
దీటుగ జైగురు యనకున్నా ఎన్నున్నా అవిసున్నన్నా ॥అం॥

6) బోధలు ఎన్నో వినియున్నా పూర్ణబోద మాదనుకున్నా
వున్నదేవుని గనకున్నా ఎన్నున్నా అవి సున్నన్నా ॥అం॥

7) పొన్నాల్ రాజేశ్వరుడన్నా బోదించెడిదీ బోదన్నా
వున్నదానిలో ఎరుకకు మూలంవుందన్నా అవి సున్నన్నా ॥అం॥

8) సుబ్బారావు నిజగురుడన్నా శిష్యుడు కోటేశ్వరుడన్నా
వీరలభావము గనకున్నా ఎన్నున్నా అవి సున్నన్నా ॥అం॥



# దివ్యామృతమును గ్రోలుమురా!

(బృందావనమది అందరిది అను మాదిరి)

1) భాస్కరుడప్పుడు నాచేవిన్నది పార్థాయిప్పుడు వినుమిదెరా
ధీరునకెందుకు మోహము! వీడుము దివ్యామృతమును
గ్రోలుమురా - ॥బా॥

2) అమృతమృతంబులు ఆత్మానాత్మలు - అఖిల ద్వంద్వములు
నేనేరా ఆత్మానాత్మ కవ్వలిదచలము - అర్జుననదిగో
చూడుమురా ॥బా॥

3) వచ్చెడి పోయెడివాడను నేనని - వదలక మదిలో నమ్ము
మురారాకడ పోకడ లేనిది అచలము - శోకము
మానియు కనుగొనరా ॥బా॥

4) పూనికతో కైవల్య దేహమున - పురుషోత్తమునిగ మెల
గుమురా - పూర్ణముగాంచిన, పురుషోత్తముడే - మృగ
జలంబువలె మృగ్యమురా ॥బా॥

5) బీజము నేనని భూజమె జగమని - బీజమునే భేదించుమురా
బీజము బోయిన భీతియెలేదని - తేజముమీరగ కనుగొనరా
॥బా॥

6) సూత్రమె నేనని గాత్రమెజగమని - సూత్రమునే ఛేదించు
మురా - సూత్రగాత్రములు శూన్యమయ్యెగురు - సూచ
నయే పరిపూర్ణమురా ॥బా॥

7) కృత్రిమ కులమత కృత్రిమ భాష్యము కూటస్థునిలో కుళ్ళేరా - కూటమురహితంబైనచొ నావల వైకుంఠంబదె గాంచుమురా ॥బా॥

8) చిత్తమె క్షేత్రము, క్షేత్రజ్ఞుండన - నేనేయంచును కనుగొనరా - క్షేత్రజ్ఞుండిల బోయిన నావలి - సూత్రంబదె గురు సూచనరా ॥బా॥

9) ద్వాదశి షోడశిద్వయ మంత్రంబుల - గూఢార్థంబును వినుమిదెరా - ఎరుకే తొలగినయేదిక జన్మము - యెరిగే వారలు యెవరికరా ॥బా॥

10) పొన్నాల్ రాజేశ్వరుడు గురుబోధలు - పూర్ణానందను దీక్షనురా - కొండమడుగులా వేంకటరెడ్డిటు - కోరిక దీరగ చాటెనురా ॥బా॥

---

# మరువనేమరువం

(కీర్తన)

(సదాశివ బ్రహ్మేంద్రుల మరువారం వారం వరుస)

పల్లవి : మరువనే మరువం - శ్రీ సద్గురు నామస్మరణం

1) నీకృపా కటాక్ష ప్రసారం
జన్మ కర్మల మూల వినాశం ॥మరు॥

2) నీ బోధామృత రసాస్వాదనం
సంతృప్తిత హృదయ స్వాస్తం ॥మరు॥

3) నీ సేవ నిష్ఠలే మా లక్ష్యం
హృదయగ్రంధి నాశనమే ఫలితం ॥మరు॥

4) షోడశోపచార పూజితపాదం
మా నేత్రాలకు సుందరదృశ్యం ॥మరు॥

5) శ్రీ సీతారాముల కారణ జన్మం
వీరభద్రుని భ్రాంతి విచ్ఛేదం ॥మరు॥



# వినవే గురుమంత్రం మనసా
# కనవే గురురూపం

(కీర్తన)

(సదాశివ బ్రహ్మేంద్ర కీర్తన - చింతానాస్తిఖిలాం - వరుస)

1) వినవే గురుమంత్రం మనసా కనవే గురురూపం ॥విన॥

2) భవరోగ భయ వినాశనం సకలారిష్ట భయరహితం ॥విన॥

3) సద్గురువర్యుని శ్రీపాదం సాధుసేవిత దివ్యపథం ॥విన॥

4) గురుచరణయుగళ దివ్యస్థానం శ్రీ శివశక్తుల అనుసంధానం ॥విన॥

5) సద్గురు సందర్శనభాగ్యం॥ పాపపుణ్య దోషహరం ॥విన॥

# కీర్తన

భజియింపరా గురుని మానవా
నీకు భయమేలేదిసుమంత కానవా?

1) భజియింపకుంటివా? బహుజన్మ బాధల్లో
మునిగి తేలుట నీకు మురిపమనిపించెనా? ॥భజి॥

2) ఇష్టదేవతల నరులు నిష్టతొ సేవించినట్లు
నిరతము గురు సేవయున్న నీపయి కరుణించునన్నా ॥భజి॥

3) మంత్రయంత్ర తంత్రములు మహిమలె జూపించునన్నా
మరల జన్మ బాధలెపుడు మాన్పలేవు యెరుగుమన్నా ॥భజి॥

4) భక్తిజ్ఞాన కర్మయోగ బంధములో బడకుమన్నా
భుక్తిముక్తి క్రియల రెంటియుక్తి గురుడు దెలుపునన్నా ॥భజి॥

5) యజ్ఞ యాగంబులెల్ల అజ్ఞానపు చేష్టలన్నా విజ్ఞులెవరు
మెచ్చబోరు విడదు సంచితంబన్నా ॥భజి॥

6) సంచితంబు తొలగజేయ సద్గురుడె సమర్థుడన్నా
కమలజహరిహరులెల్ల గనరు దీని మర్మమన్నా ॥భజి॥

7) సప్తకోటి మంత్రముల సాధనేమి ఫలమన్నా
సూక్ష్మములో మోక్షమును జూపును సద్గురుడన్నా ॥భజి॥

8) అఖిల తనువులందునున్నా ఆత్మ కేకంబైనదన్నా
ఆత్మతత్వ మరసితివా? యారాటము బాయునన్నా ॥భజి॥

2) నీ బోధామృత రసాస్వాదనం
సంతృప్తిత హృదయ స్వాస్తం ॥మరు॥

3) నీ సేవ నిష్ఠలే మా లక్ష్యం
హృదయగ్రంధి నాశనమే ఫలితం ॥మరు॥

4) షోడశోపచార పూజితపాదం
మా నేత్రాలకు సుందరదృశ్యం ॥మరు॥

5) శ్రీ సీతారాముల కారణ జన్మం
వీరభద్రుని భ్రాంతి విచ్ఛేదం ॥మరు॥



# వినవే గురుమంత్రం మనసా
# కనవే గురురూపం

(కీర్తన)

(సదాశివ బ్రహ్మేంద్ర కీర్తన - చింతానాస్తిఖిలాం - వరుస)

1) వినవే గురుమంత్రం మనసా కనవే గురురూపం ॥విన॥

2) భవరోగ భయ వినాశనం సకలారిష్ట భయరహితం ॥విన॥

3) సద్గురువర్యుని శ్రీపాదం సాధుసేవిత దివ్యపథం ॥విన॥

4) గురుచరణయుగళ దివ్యస్థానం శ్రీ శివశక్తుల అనుసంధానం ॥విన॥

5) సద్గురు సందర్శనభాగ్యం॥ పాపపుణ్య దోషహరం ॥విన॥

# కీర్తన

భజియింపరా గురుని మానవా
నీకు భయమేలేదిసుమంత కానవా?

1) భజియింపకుంటివా? బహుజన్మ బాధల్లో
మునిగి తేలుట నీకు మురిపమనిపించెనా? ॥భజి॥

2) ఇష్టదేవతల నరులు నిష్టతొ సేవించినట్లు
నిరతము గురు సేవయున్న నీపయి కరుణించునన్నా ॥భజి॥

3) మంత్రయంత్ర తంత్రములు మహిమలె జూపించునన్నా
మరల జన్మ బాధలెపుడు మాన్పలేవు యెరుగుమన్నా ॥భజి॥

4) భక్తిజ్ఞాన కర్మయోగ బంధములో బడకుమన్నా
భుక్తిముక్తి క్రియల రెంటియుక్తి గురుడు దెలుపునన్నా ॥భజి॥

5) యజ్ఞ యాగంబులెల్ల అజ్ఞానపు చేష్టలన్నా విజ్ఞులెవరు
మెచ్చబోరు విడదు సంచితంబన్నా ॥భజి॥

6) సంచితంబు తొలగజేయ సద్గురుడె సమర్థుడన్నా
కమలజహరిహరులెల్ల గనరు దీని మర్మమన్నా ॥భజి॥

7) సప్తకోటి మంత్రముల సాధనేమి ఫలమన్నా
సూక్ష్మములో మోక్షమును జూపును సద్గురుడన్నా ॥భజి॥

8) అఖిల తనువులందునున్నా ఆత్మ కేకంబైనదన్నా
ఆత్మతత్వ మరసితివా? యారాటము బాయునన్నా ॥భజి॥

9) నీవు బయలుయందున్నా నిజము నెరుగవేమన్నా
రాజయోగి కరుణ వితలరావుకు సంపూర్ణమన్నా ॥భజి॥

## కీర్తన

వినవోయి బాటసారీః విడవేమి మురికిదారీ ॥వినవోయి॥
మరుగైన బాటగనరో - మహనీయులెల్లచనరో ॥విన॥

1) భానుండు యాజ్ఞవల్కీ జనులౌ జనక శుకులూ
సాందీప శ్రీ కృష్ణులూ శ్రమియించిరట్టి ఘనులూ ॥విన॥

2) పరమాత్మ నెరుగకున్నా పలు తెరగు జన్మలన్నా
మరణ జననంబు లెన్నో మరిగల్గు మిన్నకున్నా ॥విన॥

3) మాయ లోకములనిండా మమతాలె పెరుగుచుండ
మాయేదొ తెలియకుండా మనిషయ్యి యేలనుండా ॥విన॥

4) ఏ బీజములు నేడునాటా ఆఫలములే వచ్చునాటా
తాజేయ కర్మఫలమూ తాబొందుటట్లే నిజమా ॥విన॥

5) అల్పమౌ కాలమందూ అన్ని విఘ్నములె మనకూ
పరిపూర్ణ బోధ కొరకూ పయనించు గురునికడకూ ॥విన॥

6) నీతి మార్గమువదలకా నియమ నిష్టల విడబొకా
కర్తవ్య కర్మల మరువకా క్రమశిక్షణల విడువకా ॥విన॥

7) బయలందూ నీవుయున్నా భ్రమదొలగి పోదురన్నా
బయలందునీవు సున్నా భయభ్రాంతులేలరన్నా ॥విన॥

8) శ్రీరాజయోగి గురుడూ ఆశ్రితుల పాలి ప్రభుడూ
కరుణానిధివటన్నా కరుణించె విరలునన్నా ॥విన॥



# గురుదరిచేరగడె

(కీర్తన)

పల్లవి : గురుదరి జేరగదే ఓమనసా పరమును జూపుగదే
॥ఓమనసా॥

అనుపల్లవి : గురుడు నరుండనీ మదినితలంపకూ
పరగంగను పరమాత్ముడె మనసా ॥గురుదరి॥

1) క్షుత్పిపాసానుప్తి సంగములు క్షుద్రజీవులకు నరులకు సమ
మే జ్ఞానమె అధికము, మానవజాతికి జ్ఞానమేలేనిచో
మానవపశువే ॥గురు॥

2) పలుజన్మలలో పలుయోనులలో పదె పదె పుట్టుచు
బాధ నొందెదవు, మరణ జననముల్ మరిలేకుండెడి
మార్గ మెరిగి తరియించవె మనసా ॥గురు॥

3) స్నానసంధ్యలూ జపతపవ్రతములు చాలగజేసిన జనుడు
తరించునే మరల జన్మ కేమరిగి తిరుగుచూ గర్భనరకము
నగాసిలకుండునె ? ॥గురు॥

9) నీవు బయలుయందున్నా నిజము నెరుగవేమన్నా
రాజయోగి కరుణ వితలరావుకు సంపూర్ణమన్నా ॥భజి॥

# కీర్తన

వినవోయి బాటసారీః విడవేమి మురికిదారీ ॥వినవోయి॥
మరుగైన బాటగనరో - మహనీయులెల్లచనరో ॥విన॥

1) భానుండు యాజ్ఞవల్క్య జనులౌ జనక శుకులూ
సాందీప శ్రీ కృష్ణులూ శ్రమియించిరట్టి ఘనులూ ॥విన॥

2) పరమాత్మ నెరుగకున్నా పలు తెరగు జన్మలన్నా
మరణ జననంబు లెన్నో మరిగల్లు మిన్నకున్నా ॥విన॥

3) మాయ లోకములనిండా మమతాలె పెరుగుచుండ
మాయేదొ తెలియకుండా మనిషయ్యి యేలనుండా ॥విన॥

4) ఏ బీజములు నేడునాటా ఆఫలములే వచ్చునాటా
తాజేయ కర్మఫలమూ తాబొందుటట్లే నిజమా ॥విన॥

5) అల్పమౌ కాలమందూ అన్ని విఘ్నములె మనకూ
పరిపూర్ణ బోధ కొరకూ పయనించు గురునికడకూ ॥విన॥

6) నీతి మార్గమువదలకా నియమ నిష్టల విడబొకా
కర్తవ్య కర్మల మరువకా క్రమశిక్షణల విడువకా ॥విన॥

7) బయలందూ నీవుయున్నా భ్రమదొలగి పోదురన్నా
బయలందునీవు సున్నా భయభ్రాంతులేలరన్నా ॥విన॥

8) శ్రీరాజయోగి గురుడూ ఆశ్రితుల పాలి ప్రభుడూ
కరుణానిధివటన్నా కరుణించె వినలునన్నా ॥విన॥



# గురుదరిచేరగదె

(కీర్తన)

పల్లవి : గురుదరి జేరగదే ఓమనసా పరమును జూపుగదే
॥ఓమనసా॥

అనుపల్లవి : గురుడు నరుండనీ మదినితలంపకూ
పరగంగను పరమాత్ముడె మనసా ॥గురుదరి॥

1) క్షుత్పిపాసానుప్తి సంగములు క్షుద్రజీవులకు నరులకు సమ
మే జ్ఞానమె అధికము, మానవజాతికి జ్ఞానమేలేనిచో
మానవపశువే ॥గురు॥

2) పలుజన్మలలో పలుయోనులలో పదె పదె పుట్టుచు
బాధ నొందెదవు, మరణ జననముల్ మరిలేకుండెడి
మార్గ మెరిగి తరియించవె మనసా ॥గురు॥

3) స్నానసంధ్యలూ జపతపవ్రతములు చాలగజేసిన జనుడు
తరించునే మరల జన్మ కేమరిగి తిరుగుచూ గర్భనరకము
నగాసిలకుండునె ? ॥గురు॥

4) భక్తిజ్ఞానవైరాగ్యములన్నియు, యుక్తమంచునీ
వూహించితివో, దేవుడెవరొ మరిదేహియెవ్వరొ
తెలియని సాధన వ్యర్థముగాదా ॥గురు॥

5) విన్నావా ఓ మాయలమనసా, పొన్నాల్ రాజేశ్వరుని
బోధలు తిన్నగ విఠల్‌దాసు తీరుగా తెలుసుకున్న
మరిజన్మనున్నయని ॥గురు॥

# విరిసింది పూవు

(కీర్తన)

(కురిసింది వాన నా గుండెలోన అనుమాదిరి)

1) విరిసింది పూవూ నాడెందమందూ - నీపూజకై యింపుగా
మురిసే లాలోనా మరిచే నెన్మేనూ నీ పూజకై యింపుగా
॥విరి॥

2) ఎన్నో యుగములు నీ సన్నిధికై పొన్నగపూచేనూ
అన్నెము పున్నెము అన్నియు నీవని సన్నుతిజేసేనూ
కన్నీసదీరా ... అన్నా రావేలా ? ॥విరి॥

3) మూలము లేని మొలకకు భక్త్యను జలమును పోసితినీ
తలపులవలేనే వలపుల తరువై తలతల పెరిగేనూ
తలిరాకులోన తొలిపున్నె మనగా ॥విరి॥

4) నీపదములనే శ్రీ పదమనుచూ తేపకు తలచేనూ
ప్రాపుగ నిలిచే ప్రభుడవు నీవని ప్రార్థన జేసేనూ
కృపజూపవేమీ? అపరాదమేమీ ॥విరి॥

5) నిరుపాధికమౌ పరిపూర్ణములో ఎరుకేలేదనుచూ
గురుతుగదోచిన కరువలి కెప్పుడు మూలము లేదనుచూ
గురుబోధ వినుచూ తరియింతుననుచూ ॥విరి॥

6) ద్వాదశి షోడశి ధర్మము దెలిసీ ఖేదముబాయగనూ
సాధన లేనీ సౌజ్ఞనుజూచీ భేదము వీడగనూ
మదియుల్లసిల్లా పదమందుద్రాలా ॥విరి॥

7) పాటల పండరినాధుని బ్రోచిన వాసవుడీననుచూ
సూటిగ బోధను నాటగ జేసిన మేటివి నీవనుచూ
రాజేంద్రవర్యా రక్షింతుమనుచూ ॥విరి॥

---

# మహిళా విభాగము

## ఆవేదన (కీర్తన)

ఒకసారి కనుపింపవా నా తండ్రి యికనైనా దయదల్చవా

1) తనువు ముదిమికొచ్చింది. మనసు బలము తగ్గింది
మీదకు లంఘింపమిత్తి మెడలు యెత్తి చూస్తోంది
ఒకసారి కనుపింపవా నాతండ్రి యికనైన దయతల్చవా॥

2) యెన్నెన్ని పూజలో యెన్నెన్ని వ్రతములో
అన్నియు చాలించినిన్నె యర్చించు భక్తురాలి ॥ఒకసారి॥

3) యాత్రలెన్నోజేసి క్షేత్రము ల ధర్శించి విసిగి వేసారి
నిన్ను వేడినాను కృపజూడగ ॥ఒకసారి॥

4) యుగయుగాలుగా నీవు యూహకందగరాక దోబూచు
లాడుచూనె దోచుగొంటివి మనసు ॥ఒకసారి॥

5) యెన్నిజన్మలెత్తినానొ ఎన్ని వేషములేసినానొ
చాటుగా నిలుచుండియైన చక్కగా నినుచూద్దామని
॥ఒకసారి॥

6) నిజరూపమేదొ తెలియకుండగ నివురుగప్పిన నిప్పువోలె
పంచాకాశములదాగి ప్రత్యక్షముగావేమి ॥ఒకసారి॥

7) రాఘవ అదృష్టవంతురాలటంచు భక్తులందు
రేమి యదృష్టమొగాని యింతవరకు నిన్నుగాన ॥ఒకసారి॥

8) రూపుదాల్చిన దేవుడంచు రూఢిగ నిన్ను నమ్మియుంటి
యెందు వెదకుదు దేశికేంద్ర యేమి చేయుదు
రామచంద్ర ॥ఒకసారి॥



# మేలుకొలుపు

(కీర్తన)

పల్లవి : శ్రీరామచంద్రా స్వామీ నిదురలే, సీతామనోహరా
వేదన తీరెనూ ॥శ్రీరామచంద్రా॥

1) ఏనాటి పుణ్యమో నాజన్మ సఫలమై
నన్ను కడతేర్చినావు, దన్యురాలనైతి ప్రభో: ॥శ్రీరామ॥

2) కర్మదేహమిచ్చినావు జ్ఞానభిక్ష పెట్టినావు
జనన మరణ భ్రాంతి సంపూర్తిగ దొలగించావు ॥శ్రీరామ॥

3) పిండాండ మందునా బ్రహ్మాండమందునా,
రెండింటా నెగురగొట్టి పూర్ణస్థితి నిచ్చినావు ॥శ్రీరామ॥

4) ఆకారము లేనిదీ, సాకారముగానిదీ
అంతటను నీవుండి అపరోక్షమైవుందీ ॥శ్రీరామ॥

5) నీ జన్మదిన మహో నామనసు నిండెనూ
కనులు విప్పి గురియింపు కరుణామృతరసమూ ॥శ్రీరామ॥

6) కలలోన గాసిజెంది కలవరిస్తినా కలలో
మేలుకొంటి బోధచేత కనులువిప్పి మేలుకో ॥శ్రీరామ॥

7) భక్తులంత గుమికూడి ప్రార్థించుచున్నాము
మేలుకో మా స్వామి మేలుకోవయ్యా ॥శ్రీరామ॥

8) నరసాపురిలో నుండి రాజయోగివై యుండి
గురు ఋణంబును దీర్చ గురుబోధ దెలిపేవు ॥శ్రీరామ॥

9) శ్రీరాజయోగివై సికింద్రాపురిలో నుండి
రామచంద్రు నేలినావు రాఘవను బ్రోచినావూ ॥శ్రీరామ॥

## కీర్తన

"సద్గురు దేవా సమరస భావా ననుదయగనరావా"
("రామాలయం" సినిమాలో జగదభిరామ వరుస)

పల్లవి సద్గురు దేవా సమరసభావా ననుదయ గనరావా
దేవా! మము కరుణించుమయా, గురుదేవా రావయ్యా
నాస్వామీ లేవయ్యా!

1) నీరూపమునే ధ్యానించుచుంటీ నీ మంత్రమునే
జపియించుచుంటీ, సంశయములను తీర్చుటి దేవా, సాక్షి
రూపుడ నీవేనయ్యా నను దయనగరావా - దేవా- నను
కరుణించుమయా ॥సద్గు॥

2) జీవుడనేనూ, దేవుడవీవూ, విశ్వమంతటా నిండిన దేవా
జీవశివులకు భేదములేదని నేనేనీవని నమ్మితిదేవా నను
దయ గనరావా - దేవా - ననుకరుణించుమయా ॥సద్గు॥

3) జనన మరణ వ్యధచాలగ జెంది విసిగి వేసారితినయా
దేవా నీ చరణములే ప్రాపనినమ్మి జన్మరహితమును గోరితి
నయాననుదయ గనరావా - దేవా - ననుకరుణించుమయా
॥సద్గు॥

4) సీతారాముల గర్భవాసమున జన్మించిననే రాఘవ
నయ్యా శక్తిసమర్థత లిచ్చియువేగ భ్రాంతిమూలమూ
ద్రుంచుమయా ననుదయగనరావా - దేవా - ననుకరుణిం
చుమయా ॥సద్గు॥

5) శ్రీరాజేంద్రుల చరణముబట్టిస్థిత ప్రజ్ఞుడవై యుంటి
వయా శ్రీరామచంద్రుని శీలముగల్గి సార్థక రాముడ
వైతివయా ననుదయగనరావా - దేవా - ననుకరు
ణించవయా ॥సద్గు॥



# నిదురలేచే వేళ రారా

(కీర్తన)

(తెల్లవారవచ్చె తెలియగ నాస్వామి మళ్ళీ వలె)

పల్లవి : నిదుర లేచేవేళరారా సద్గురుదేవ, నిదురలేచే వేళారా

1) నిదురనుండీ నేను నిన్ను ధ్యానించుచును
లేచికనుగొన విశ్వమంతానిండె నీజ్ఞాన తేజంబు
నీవుకానగరావు అదియేమి పాపమో
ఒక్కసారీరమ్ముస్వామీ ఒక్కసారీరమ్ముస్వామీ ॥నిదు॥

2) గురుమూర్తి నాచెంత వుంటునేవున్నావు
ఎందుకో దోబూజలాడుచున్నావు
వేవేగమేవచ్చి కరుణించరాదొకో
కళ్ళుకాయలుకాచెస్వామీ కనుపించరాదొకో స్వామీ ॥నిదు॥

3) ఏజన్మఫలమోను యీజన్మయందు
నీపాద సేవయే సిద్ధించెనాకు
హృదయమందిరమందు నిలచి నీవెప్పుడూ
బ్రాంతి రహితముచేయు దేవా - భ్రాంతిరహితముచేయు
॥దేవా॥

4) శోకమోహములతో క్షోభించుచున్నాను
అజ్ఞానతిమిరంబు నావరించేనన్ను
విశ్వంబె నీవనే విజ్ఞానదీపికను
వెలిగించవోయి నా హృదయకుహరమునందు ॥నిదు॥

5) నీమాటనేనమ్మి నిన్నె సేవించీ
అన్యసాధనలేమి యాసించబొను
విజయంబు కల్గించు విజయలక్ష్మికి వేగ
సీతామనోహరా శ్రీరామచంద్ర ॥నిదు॥

# గురుడడుగో

(కీర్తన)

అడుగో : అల్లడుగో! వలె (చంద్రహాస సినిమా)

పల్లః : గురుడడుగో! ప్రభువరుడడుగో గుర్తుబాపు
పురహరుడడుగో ॥గురుడడుగో॥

చరణములు :

1) నాకు మూలమూ నాకుస్థానమూ : నాదురూపమూ
తానేయగుచూ నేనేతానై, తానే నేనే సర్వము తానై
నిండియుండిన ॥గురుడడుగో॥

2) పిండరూపుడవుగావూ, బ్రహ్మండరూపుడవుగావూ,
రెండూ మీరి నిండియుండిన ఆత్మరూపుడవేనీవూ
అని దృఢపరచీ, ఆత్మ దెలిపిన ॥గురుడడుగో॥

3) గురువు శిష్యుడూ, యెరుకజగములూ బయలునలేవని
బాగుగదెలిపీ బయలును జూపీ **భ్రాంతిని** బాపిన ప్రభుతతడే
ఆశజయించిన వాడతడే ఆశలేని పు రహరుడతడే
॥గురుడడుగో॥

4) నన్నుజూడు నా అందముజూడూ
నేనేయైన విశ్వముజూడూ
చూచిచూచి ఆచూపులు వీడూ
చోద్యంబుగ యిక పుట్టవుపొమ్మను ॥గురుడడుగో॥

5) శ్రీరాజయోగి ప్రియశిష్యరత్నము
రాజయోగి సద్ధర్మ వర్తనుడు
రాఘవనేలిని రామచంద్రుడు
హృదయ కుముద శరశ్చంద్రుడు ॥గురుడడుగో॥



# సద్గురునామాస్మరణం

(కీర్తన)

పల్లవి : సద్గురునామాస్మరణం - సంసారార్ణవతరణం॥
గురువరుపావనచరణం - ఘోరకలుషభయహరణం ॥॥
॥సద్గు॥

చరణములు :

1) గురు దేవులవాక్యమెమంత్ర - గురుపూజేశుభతంత్రం
గురురూపమె నీకొకధ్యేయం - గురునిష్టయెసర్వశ్రేయం.
॥సద్గు॥

2) గురుపదజలమేగంగా - పాతకహరణతరంగా
గురుపదసన్నిధికాశీ - గురుమూర్తియె ప్రేమారాశీ ॥సద్గు॥

3) గురుమూర్తి యెదంద్రీతల్లీ - గురుస్వామి యెకల్పావల్లీ
సంసృతి దాటగయోడా గురుమూర్తి యెతోడూ నీడా
॥సద్గు॥

4) గురుకార్యమె నీకెదీక్షా గురుకరుణయె నీకొకరక్షా విక్షేప
మే నీకొక శిక్షా నీకష్టమెరుగని ఫరీక్షా ॥సద్గు॥

5) శుభకర సుగుణా కరుడు శ్రీరామచంద్ర సద్గురుడూ
రాఘవ బ్రోచినపరుడూ భక్తవజన శంకరుడూ ॥సద్గు॥



# శరణు శ్రీ సద్గురువరా

(కీర్తన)

1) శరణు శ్రీ సద్గురువరా శరణు జ్ఞానప్రభాకరా
శరణు శాంతిసుధాకరా శరణు భ్రాంతి తమోహరా ॥శర॥

2) నలుమొగంబుల నలువయా - పలుమొగంబుల చిలు
వయా నలువసతియగు చెలువయా - పలకనేర్తురె
విలువయు ॥శర॥

3) నీ మృదుపదద్వయమునూ - నామనంబుగొల్తునూ
నీదు వాక్యద్వయమునూ - నెమ్మదిని స్మరియింతునూ ॥శర॥

4) నీస్వరూపమె ధ్యానమౌ - నీదు సేవయే పూజయౌ
నీదు వాక్యమె మంత్రమౌ - నీ కటాక్షమె మోక్షమౌ ॥శర॥

5) వాంగ్మనంబుల కందనీ - పాదద్వయమును నేగనీ
మానసంబున నిల్పినే - పాడెదన్ కరుణాధుని ॥శర॥

6) పరము దెల్పెడి ప్రభువరా యెరుక గూల్చు సుధీవరా
రాజయోగీ ఋషీవరా - పూజచేతు కృపకరా ॥శర॥

7) స్వామి జగన్నాయాకా - రామలక్ష్మి నాయకా
కామితార్థ ప్రదాయకా - శాంతిసుఖ విధాయాకా ॥శర॥

8) దీక్షితీయ ప్రబోధమూ - దెలిసి భ్రాంతి రహితమూ
చెంద సద్గురు పాదమూ - శేషగిరి సంసేవ్యమూ ॥శర॥



# రాజయోగినీదుకీర్తి

(కీర్తన)

పల్లవి : రాజయోగి నీదుకీర్తి బ్రస్తుతింప నావశమా ||రాజ||

1) అచలపూర్ణుడ శరీరుండన పేక్షా పూర్ణకాముడగుచు
నొప్పునిన్ను బొగడ హరిహరులకు తరముగాదు ||రాజ||

2) దేవనీదు దవళకీర్తి దేవలోకమాక్రమింప దేవేంద్రుడు
తన గజమును తిరిగి తిరిగి వెదకెనట ||రాజ||

3) స్వచ్ఛమగుచు నీయశంబు సత్యలోక మలముకొనగ
అచ్ఛమైన హంస కొరకు ఆయజుడే వెదకెనట ||రాజ||

4) పాలవంటి నీదుకీర్తి బ్రహ్మాండం బావరింప
శ్రీహరితాశయనింపగ క్షీరాబ్ధిని వెదకెనట ||రాజ||

5) కాంతివంతమైన నీయశము కైలాసంబాక్రమింప
కరకంటుండా కాంతిలొగానడటా వెండికొండ ||రాజ||

6) త్రిమూర్త్యా తీతుడవగు దేవనిన్ను తెలియగలరె
దీనావన కల్పభూజ త్రిలోకార్చిత పదసరోజ ||రాజ||

7) దయానంద పదసేవాదక్షుడు సత్యప్రభుని
సత్సిష్యుడు జగన్నాధస్వామి గొల్చిధన్యనైతి ||రాజ||

8) పేరులేని బయలునందు పేరులేదు పెనుమాయకు
శేషించెడిదచలమగుట శేషగిరియనిరి నన్ను ||రాజ||



# గురూత్తమా నా మొరాలకింపుము

(కీర్తన)

1) గురూత్తమా నా మొరాలకింపుము - పరాకు మాని
శుభాకరా పరాత్పరుడవని, స్మరింతు. నినుమది బిరాన
బ్రోవు దయాకరా ॥గు॥

2) సుధీవరామీ, పదాబ్జములునా హృదంబుజమ్మున
నిల్పియున్ ముదంబుతోగని, సదా పూజింతును.
మృదూక్తులను పుష్పంబులన్ ॥గు॥

3) సురాసురులు, హరిహరాదులనుగన తరంబుగాని
పరంబిదే, నిరావరణమై నిరామయంబై,
నిరంజనంబని తెల్పునో ॥గు॥

4) కృపాకరానీ, యపార మహిమల-ను, పాడగానా
సాధ్యమా, సుపావనాన, న్ను పేక్షసేయక -ను, పాలనం
బొనరింపుమా ॥గు॥

5) భూమానందులా, స్మరణచె ధన్యులు దయానంద సద్గురు
వరులూ శేషగిరమ్మను బ్రోవగవచ్చిన శ్రీ రాజయోగి
నామాంకితులూ ॥గు॥



# గురుపరంపరా మంగళహారతి

1) హారతీ వేగముగ నివ్వారే సారెకు కర్పూరహారతి
వేవేగనివ్వరే హారతీ వేగముగ నివ్వరే నారీమణులంద
రూను కోరి సద్గురు సార్వభౌముల వారిపాదసరో
జములకూ ॥హా॥

2) శ్రీమహావిష్ణు సూర్యులకూ, శ్రీయాజ్ఞవల్క్యకి భూమతో
సముడైన జనకునకూ, శ్రీ శుకాసాందీప గురులకు, వాశిగా
కృష్ణార్జునులకూ ॥హా॥

3) శ్రీదరేంద్రమహానుభావునకూ బోధస్వరూపుడు, శివ
రామా దీక్షితేంద్రులకూ అవనిసురుడగు అప్పారావుకు
ప్రవిమలుండగ సీతారాముల ॥హా॥

4) భాగవత శ్రీకృష్ణ దేవునగూ పరమ పురుషుడు, త్యాగి
యౌ శ్రీ లక్ష్మణాచార్యులకు, భోగ విముఖుండగుచు
నిలలోయోగియౌ శ్రీ వెంకటేశవధూత కిపుడూ ॥హా॥

5) భూమానందులు హనుమాయార్యులకూ, కామాది
రహితుడు ప్రేమమయుడౌ దయానందులకూ రాజ
యాఖ్యచె వెలసిభక్తుల, భ్రాంతి రహితులచేయు
గురునకు ॥హా॥

6) బైర్రాజు వంశభవునకూ వర, సత్యరాజను అ, బేధా
నంద గురువునకూ, పాలూరి వంశాబ్ధి హిమకర స్వామి
జగన్నాథ గురునకూ ॥హా॥

7) శ్రీ జగన్నాథార్య సద్గురు నీ పాదబ్జములకు చేరి
సేవలు చేసి పూజించి, శ్రీ సుబ్బారావు తోడను,
శేషగిరి తోడను గూడి ॥హా॥

# శ్రీ సద్గురు విశేషము

పల్లవి : సాటిరారు ఎవ్వరీ ధరలో, సాద్గురుమూర్తికి ॥హా॥

1) సూటిగాను వేదశాస్త్ర, కోటులనెల్లను చదివి, మాటికి
మాటకు తర్కవాదమాడుచు, మేటిశాస్త్రజ్ఞానమంత
నోటితోడనొలకబోసి, సాటిలేని పరము తెలియని
శాస్త్రజ్ఞానులూ ॥సాటి॥

2) వ్యష్టి సమిష్టులచేత, సృష్టిచేసి జగములెల్ల, ద్రష్టయగుచు
గానరాక సృష్టి చిత్రముల్, స్పష్టముగ వీక్షింపుడు,
సాక్షిమాత్రుడనంచు, సచ్చిదానందాఖ్యుడైన,
సృష్టికర్తయూ ॥సాటి॥

3) పాలసముద్రమునందు, నీలమేఘశ్యాముడగుచు,
శ్రీలక్ష్మితొ గూడియుండి, చెలువుమీరగా లీలనారాయ
ణాఖ్యుండై పాలనంబు చేయుచు జగ, దాలయుండూ నట్టి
మహావిష్ణువైననూ ॥సాటి॥

4) రజితగిరి శిఖరముపైన విజిత మన్మధుడగుచు నిలచి
అజస్రము రామనామ భజన చేయుచూ, గజచర్మ

ధారియై, లయకారి యగుచు నాట్యమాడు
కాలాంతకుడైన కరకంఠుడైనను ॥సాటి॥

5) శ్రీదయానందులపాద, సేవచేసి పరము నెరిగి ఎరుక
విడిచి పరిపూర్ణ స్థితిని దనరుచూ త్రిగుణా తీతుడైనయట్టి
అగణిత మహత్ముడైన, జగన్నాధస్వామి
శ్రీ అమలానందులా ॥సాటి॥

6) శ్రీ జగన్నాధుల చరణ సేవకులై చెలగుచున్న
చిట్టెమ్మను శేషగిరిని చేరిబావగా శ్రీమించు
పాలూరి వంశ, సోముడై విలసిల్లుచున్న
రామలక్ష్మీనాధుడౌ స్వామి మద్గురునీ ॥సాటి॥



పల్లవి : సద్గురురాయనీ, చరణ కమలములకు, సాష్టాంగ మొన
రించెదన్, భక్తితొ సాష్టాంగ మొనరించెదన్

అనుపల్లవి : సాష్టాంగ మొనరించి, సరగున నీపాదరజమునే దరి
యించెదన్, శిరమున, రజమునే ధరియించెదన్
॥సద్గు॥

1) భవనాశస్తితిలేని పరమార్ధమును దెల్పు ప్రభుడ
వీవని వీటినే మా ప్రాపు వీవని యంటినీ,
ప్రవిమలమెనట్టి పరిపూర్ణస్తితిదనరు భవదీయ
మూర్తిని గంటినీ, భవ్యస్వరూపుని గంటినీ ॥సద్గు॥

2) ఎరుక మరుపులేని తెరపు జూపెడి గొప్ప, దొరవు
నీవనివింటినీ, మాయప్ప నీవని యంటినీ ఎరుక
మరుపులు లేక ఏకరీతిగనున్న, కరుణా సాగర
నిన్ను గంటినీ కరుణా భరణుని కనుగొంటినీ ॥సద్గు॥

3) దేహి దేహములానే, మోహము లణచువి దేహవాసి
వనుచు వింటినీ సందేహా రహితుడవని వింటినీ
సోహం బ్రహ్మమును, ఊహచే గూల్చిన, సాహస
వర్యనిన్ గంటినీ, సద్గుణధుర్యున గంటినీ ॥సద్గు॥

4) శ్రీ అనసూయ తోడ, సికింద్రాబాదులో స్థిరముగ
నున్నట్లు వింటినీ సుస్థిరుడై యున్నట్లుగ వింటినీ
నేరుపుతో భక్తినిచయము బ్రోచేటి శ్రీ దయానందుల
గంటినీ తరియించు మార్గము వింటిని ॥సద్గు॥

5) శ్రీ జగన్నాధులు సేవకుల పాలిటి చింతామణి యనగ
వింటినీ వారి సత్కృప కాశించి యుంటినీ శ్రీ సుబ్బా
రావును శేషగిరియు వారి సేవ చెయ్యగ వచ్చిరంటినీ
శ్రీఘమె రక్షింపు మంటినీ ॥సద్గు॥

---

# స్వామి సద్గురునాధు జూడరే

(కీర్తన)

పల్లవి : స్వామి సద్గురునాధు జూడరే ఓ సుజనులార!
చూచి పూజ సల్పి వేడరే

అనుపల్లవి : మా గురువే జగద్గురువు మా ప్రభువే లోకప్రభువు
యీ మహిలో నిట్టి ఘనుని యింకమనము చూడబోము
॥స్వామి॥

1) సాధనాతీత మార్గమూ - ఓ సుజనులార - చక్కనీ
ఘన రాజమార్గము బాధలెల్ల తొలగజేయు సాధన
గురు భోదయనుచు సాధుసమ్మతమగు బోధను బోధించెడి
పూర్ణగురువి ॥స్వామి॥

2) పరమపురుషు సన్నిధానమూ - ఓ సుజనులార -
తరుగులేని పెన్నిధానమూ పరశువేది చేరినంత
బంగారౌ యినుముపోల్కి గురుకులవాసంబు జేయ ఎరుక
విడును నిశ్చయముగ ॥స్వామి॥

3) పరిపూర్ణము, యెరుకలేనిదీ - ఓ సుజనులార - గురుడు
చూపక తెలియరానిదీ - పరమాత్మయె గురురూపము
ధరియించెను మనలబ్రోవ పరముజూపి యెరుకగూల్చి
భక్తజనుల భ్రాంతిబాపు ॥స్వామి॥

4) పరమె స్థిరంబనును ద్వాదశీ - యెరుక లేదనును
షోడశీ వారిని కలను గాంచినట్టి కరిపోలిక లేదు జగము
సరిగ విచారించిచూడు యెరుక నిల్వదనుచు దెల్పు
॥స్వామి॥

5) పాన్నాల్ రాజయోగిచే - ఓసుజనులార - విన్నారా
నిజప్రబోధము, కన్నారా గాంచినట్టి ఘనుడు
జగన్నాధ గురుడు తిన్నాగా శేషిగిరికి దెలిపిభ్రాంతి
పోద్రోలెను ॥స్వామి॥



# జయ జయ దేవ గురో

(కీర్తన)

పల్లవి : జయ జయ దేవగురో - సద్గురుదేవా - జయ జయ
దేవగురో - దయానందా - జయ జయ దేవగురో - దయా
నిధే జయ జయ దేవ గురో

అనుపల్లవి : జయజయ యని నీకు జై జైలు పల్కూట బయ
భ్రాంతులవి యెట్లా క్షయమగుటకే నయ్య ॥జయ॥

1) నిదరలేచినదాది నిదురించు నందాక ఏదేదియో చింత
హృదయాన్ని వేధించూ - ఎదురులేని మందే నీనామ
స్మరణంబె వ్యధతీర్చి - కరుణించ వేడేదనో స్వామి ॥జయ॥

2) కోపతాపంబూలూ ఏ పాప ఫలమౌనో నాపెత్తనము
మీరి పైపైకి పెల్లుబుకు నీపాద యుగళంబె నాపెన్ని
దానము నాపైన దయహెచ్చి కాపాడవే వచ్చి ॥జయ॥

3) ఏమేమి చేసినా నామనసు క్షణమైన ఎందునిల్వదు
దేవ యింకేదియో త్రోవ భక్తురాలిని నాకు శక్తి
పాతముచేత ముక్తి నీయవె నిన్ను మొక్కి
వేడెద స్వామి ॥జయ॥

4) కాలమాగక వేగ గడచిపోవుచుండె - ఆలసిస్తే మరణ
మాసన్నమగునేమొ ? పాలముంచిన నీవె నీటముంచిన
నీవె జాలమేలాస్వామి శరణిచ్చి కాపాడ ॥జయ॥

5) రామచంద్రునితోడ రాజయోగముబూని రాజయోగీ
నిన్ను పూజించు యీ శీతమహలక్ష్మి నెటులైన
మన్నించి బ్రోవవే ॥జయ॥

## యింతకంటె కావలెనా యీ కష్టముచాలదా ప్రభు

పల్లవి : ఇంతకంటె కావలెనా యీకష్టము చాలదా ప్రభు

1) ఎంతకాలమై పుట్టి నానొ యెందరెందరు తల్లిదంద్రులో
యెన్ని జన్మలు యెత్తినానొ యేమికష్టము పొందినానొ
॥యింత॥

2) గర్భనరకములోన దుర్భర కష్టములు వర్ణింపనౌనే
యిరుకు యోనినుండి బైటపడుట కెంతబాధ పడితినో
॥యింత॥

3) బైటపడిన దాదిగా నేపడిన పాటులు లెక్కలేనివి
యెంతకాలము బ్రతుకవలెనొ యెంతకష్టము పొందినానొ
॥యింత॥

4) ఒకటి వెనుక నొకటిగా మరియొకటిగా కెరటములవలెనె
ప్రకటమై చనుదెంచు కష్టములకట నే భరియింపజాలా
॥యింత॥

5) వేలకొద్దీ చేరి యొకటా వేయితేళ్ళు గుట్టినటుల
బొందివీడి పోవునపుడు పొందు మరణ బాధయెంతో
॥యింత॥

6) ఏడనో యేచెట్టు క్రిందో యెట్టులో ప్రాణంబు పోవును
ఎవ్వర్వరో దీన్ని యీడ్చివేసి పూడ్చివేతురో కాల్చివేతురో
॥యింత॥

7) క్రొవ్విడివారింట బుట్టి కొవలవారింట బడితి
శేషమాంబ దాసురాలై సేవజేసితి కొన్నినాళ్లు ॥యింత॥

8) అబ్బబ్బా యిక జన్మవద్దూ ఐనదేమో అయిపోయె
జన్మరహితము జేయు తండ్రిశరణు శరణు రాజయోగి
॥యింత॥



# మేలుకొలుపు

(తెల్లవారగవచ్చె తెలియగ నాస్వామి వలె)

పల్లవి : శిష్యులందరు నిన్ను సేవించి మేల్కొనియు
మేల్కొలుపుచున్నారు లేరా మేల్కొలుపుచున్నారు లేరా

అనుపల్లవి : మేల్కొన్న కల జగము మిథ్యైను యని దెలిసి
మళ్ళీ నిదురబోకు లేరా - మళ్ళీ నిదురబోకులేరా ?
॥శి॥

1) నిదురబోయితె కలలో నీ జన్మ ముచ్చట్లు
నీకుతోచును వేగలేరా
హద్దు మీరిన నిద్రవద్దయ్య నాస్వామి
శుద్ధవియద్రూపలేరా శుద్ధచిత్తములోకి రారా ॥శి॥

2) నీవు నిదురించితే యీరేడు లోకాలు
నిదుర బోవును మేలుకోరా
స్వామి మేల్కొనియింక సర్వలోకాలని
మేలుకొల్పగ లేచిరారా యేలుకొందువుగానిలేరా ॥శి॥

3) నన్నుదరి జేర్తువని నిన్నే నమ్మితి తండ్రి
వున్నదానిని జూపలేరా
యిన్ని యెరిగినవాడ వీవె నిదురించితే
యేమౌదు మేమింకలేరా ॥శి॥

4) పొన్నాల రాజేంద్రు డెరిగింపగావిన్న
పూర్ణబోధను దెలుప లేరా
సున్నా బయలులో యెరుక చూడుమని చూపించు
సుబ్బారాయా నిదుర లేరా ॥శి॥

5) చల్లా రుక్మిణి నీవె తల్లి దండ్రివంచు
సేవింపుచున్నాది లేరా
మళ్ళీ జన్మకురాని మార్గము జూపింప
త్రుళ్ళిపడకను మేలుకోరా ॥శి॥

## పూర్ణబోధ దెల్పునట్టి పుణ్యపురుషులే (కీర్తన)

పల్లవి : గురువులెపుడు శిష్యులయెడల దయామయులే,
పూర్ణబోధ తెలుపునట్టి పుణ్యపురుషులే
పూర్ణబోధ తెలిపునట్టి పుణ్యపురుషులే

1) దర్శనంబు యిస్తేచాలు పుణ్యమూచేరూ
పాదస్పర్శ నిస్తేచాలు పాపము పారూ
చూపు చూస్తే చాలు కరుణ, పొంగులువారూ
పలుకు పల్కితేచాలు తేనెలు పారూ ॥గురు॥

2) తల్లిదండ్రి దొరదాత దైవము గురుడే
అజ్ఞానహరుడు మోక్షకరుడు పరాత్పరుడే
గురువుకంటె గొప్పేలేదు వెదకిచూసినా
తల క్రిందుగా నిల్చి తపముజేసినా ॥గురు॥

3) యజ్ఞయాగ క్రతువులందు యెన్ని జేసినా
హృదయకాశమందు కళల నెన్ని జూసినా
కొండగుహలలో దూరి కొర్కొలడచినా
ఉన్నపూర్ణ మరయ లేరు ఒట్టియాశలే ॥గురు॥

4) కర్మభక్తి యోగజ్ఞాన మర్మములన్నీ
దెలియకున్న పూర్ణబోధ తెలియతరంబా
యెరుకలేదు పూర్ణముంది యింతే బోధా
అనిదెల్పే వారి బోధ అల్పముగాదా ॥గురు॥

5) దయానంద రాజయోగి ధర్మప్రబోధా
గురుకృపా పాత్రులకును కొంగు బంగారం
కీలుదెలిపి దిద్దితీర్చి యేలుకొంటారూ
దీవించీ రాజయోగి దీక్షనిస్తారూ ॥గురు॥

6) కేశిరాజు శేషాచలం దేశికేంద్రులూ
మాణిక్యాంబతో గూడి మర్మమెరిగిరీ
రంగనాయకమ్మ అంతరంగముదెలసీ
జనన మరణ భ్రాంతిరహితం జాడదెల్పిరీ ॥గురు॥

# దేశికప్రభుడవు నీవేనయ్యా

(భజన కీర్తన)

(బృదావనమది అందరిదీ - వలె)

పల్లవి : దేశిక ప్రభుడవు నీవేనయ్యా దేవదేవుడవు నీవయ్యా
గురుమహరాజ్, శ్రీగురుమహరాజ్
జైగురు మహరాజ్ - సద్గురు మహరాజ్

1) ప్రొద్దున నిద్దుర లేచెదము నీ మృదుపదయుగళము
తలచెదము సవినయంబుగ శ్రవణముచేసియు
గురుగోప్యంబును నెరిగెదము ॥దేశిక॥

2) నీమూర్తినె మదినిలిపెదమూ - నీపదపూజే నెరెపెదము
నీవాక్యములె స్మరియించెదమూ నీకృపబడసి తరించెదము
॥దేశిక॥

3) సాంఖ్యతారకా అమనస్కాదులు తరచితరచి శోదిం
చెదము జన్మరహితము చేయుటకయ్యని శక్తిలేనివని
యెరిగెదము ॥దేశిక॥

4) వచ్చిన మార్గము వరుస దెలిపితివి॥ మరచిన రూపము
మరిజూపితివీ ఉన్నదానిలో నా నిజరూపము - ఉన్నదొ
లేదో జూపితివయ్యా ॥దేశిక॥

5) పలికెదమంటే పలుకగరానిది తలచెదమంటే తలపగ
రానిది సాధనంబులకు సాధ్యముకానిది నీకృపయుంటే
నెరిగితీరెదము ॥దేశిక॥

6) "దయానంద" వర బిరుదాంకితుడై
పొన్నాల్ వంశపు పూర్ణచంద్రుడై
రాజయాఖ్యచే రంజిల్లు స్వామీ
లక్ష్మీ ఓబులదాసుల బ్రోవవె ॥దేశిక॥

# లాలిపాట

1) లాలి సద్గురురాయ లాలి ప్రభురాయ
లాలించి నీకిపుడు జోలపాడెదరా ॥లాలి॥

2) ఎల్లప్రపంచంబు కల్లయేననుచూ
కలలోని కలయంచుగాంచి నిదురించూ ॥లాలి॥

3) కలగాంచి నీ తెలివి కల్లయో నిజమో
పంచదశి భావముచె పరికించగనరా ॥లాలి॥

4) చూపులోనే మంచి చోద్యమున్నదిరా
చూడచూడగనీవు దేవుడయ్యేదవూ ॥లాలి॥

5) నీవైన దేవుణ్ని నిజపుదేవుణ్ని
చూడరా చూడరా చూచి విడువుమురా ॥లాలి॥

6) భ్రాంతి రహితము జేసె పరిపూర్ణ గురుడూ
భయములెల్లనువీడి పవ్వళించుమురా ॥లాలి॥

7) రాజయోగీబోధ రామచంద్రులూ
చెప్ప ప్రసూనాంబ జడుపుమానెనురా ॥లాలి॥

# ముక్తికోసమై మాయలోపడనే

(ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు వలె)

రచన : శ్రీమతి మండవల్లి వెంకటరత్నావతి (కొవ్వూరు)

పల్లవి : ముక్తికోసమై మాయలో పడెనే పాపం అజ్ఞాని
అయ్యో! పాపం అజ్ఞాని

చరణములు :

1) పుణ్యనదులలో మునిగితె చాలని! క్షేత్రం
బులకై యాత్రలుచాలని! బొమ్మదైవముల పూజలు
చాలని, దేశద్రిమ్మరై గిరగిరతిరుగుచు!

2) ప్రత్యక్షంబౌ భగవంతుడని॥ వచ్చివరంబులు వర్షిస్తాడని
భవబంధంబులు చేదిస్తాడని మంత్రజపంబులు మరిమరి
చేయుచు ॥ముక్తి॥

3) మోక్షకారకం తారకమేనని షట్చక్రంబుల స్థానము
లెరిగి అదిపులశక్తుల హంసలనెరిగి అహోరాత్రములు
అజపచేయుచూ॥ ॥ముక్తి॥

4) అష్టాంగంబుల నభ్యసించుచూ కుండలి శక్తిని మేలు
కొలుపుచే సమాధి నిష్టను సాధించినచో జన్మరహిత
మని చాలనమ్ముకొనీ ॥ముక్తి॥

5) కారణ బ్రహ్మయె కడుసత్యంబని మాయామయ మీ
సర్వజగత్తని మహవాక్యములు మరిమరి పల్కుచు నేనే
బ్రహ్మని నిక్కినీల్గుచూ ॥ముక్తి॥

6) ఉన్నదిపూర్ణము సున్నయెరుకయని అన్నపాడుతా
యున్నడులేడని॥ గురువుకుసర్వం భర్పణజేసితె॥ జననమరణ
ముల ఝుడుపుతీరునని ॥ముక్తి॥

7) ఎరుకయిదేపరిపూర్ణమిదే అను నిశ్చయమే మరి అసలు
దెలియకా తెలిసినవారిని కలసి మ్రొక్కకా, పూర్ణుల
మంచును పొంగిపోవుచూ

8) సాంప్రదాయక సారమెరుంగక, ఆశరీర పద్ధతి అసలే
యెరుగక కర్మయుందలి కౌశల మెరుగక మంత్రము
లెరిగిన మ్రగ్గును యెరుకని ॥ముక్తి॥

# విజ్ఞాన భాస్కరోదయము

(కీర్తన)

1) విజ్ఞాన భాస్కరుడు వుదయించినాడండి
పరిపూర్ణ బోదనే ప్రకటించు నికరండి
దీక్షితా పీఠాన మకుటమై వెలుగుచూ
శరణన్న వారినీ చేపట్టి కాచుచూ ॥విజ్ఞాన॥

2) రథసప్తమట నేడు రవి జన్మదినమంట
జనని జనకులులేని జగజెట్టి యతడంట
చూడ శక్యముగాని జ్యోతి రూపుండతడు
శిష్యులను బ్రోచేటి శీత భానుండితడు ॥విజ్ఞాన॥

3) ఇనవంశ జలధికి యెసగ మూలంబతడు
యిలపకుర్తీ వంశ పూర్ణ చంద్రుడితడు
రమణి శీతాంబతో రాజయోగము బూని
భక్త జనముల బ్రోవ ప్రభవించినాడండి ॥విజ్ఞాన॥

4) ద్వాదశాదిత్యుల దివ్య రూపుండతడు
ద్వాదశాంతము జేయు ధన్య జీవుండితడు
కాంతి కిరణాలిచ్చు కర్మసాక్షి యతడు
కర్మబంధము గాల్చు కరుణామయుండితడు ॥విజ్ఞాన॥

5) చేరరాక చూడరాక సేవించగారాక
జగతినే కాల్చేటి జగచ్ఛక్షు వతడండి
కనులు చల్లగ జేయు కరుణామయండితడు
చేర వచ్చినవారి జన్మబంధముగాల్చు ॥విజ్ఞాన॥

6) శ్రీ మహవిష్ణుని సేవించి ధ్యానించి
గాఢాంధకారంబు కడద్రోసె నతడండి
శ్రీదయానందులా సేవించు కృపగాంచి
తేజోంధకారాల దెగగోసె నితడండి ॥విజ్ఞాన॥

8) సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాకు తండ్రి
అని మిమ్ము నెప్పుడూ అంతరంగమందూ
వేడుకొను మీ బిడ్డ విజయలక్ష్మిని బ్రోచి
జనన భ్రాతింర్ఝుడుపు దీర్చెడి స్వామి ॥విజ్ఞాన॥

# అలింపవా మొరలాలింపవా

(కీర్తన)

పల్లవి : ఆలింపవా మొరలాలింపవా? పాలింపవా
ప్రభుపాలింపవా

చరణములు :

1) నీచ జన్మల నెన్నియెత్తిత్తి వచ్చితినో
నరజన్మ కల్గెనూ నా భాగ్యమేమందు నీసేవ
దొరకెను నాకేమి కొదువా పరిపూర్ణ మరసి తెగద
యీ జన్మఫలము ? ॥ఆలిం॥

2) ఏ పుణ్యఫలమో ఏనాటివరమో ఈ శుభోదయం
వేళ మీ బిడ్డనైతి మనసేమొ మీ మంత్ర మనసంబు
కోరు, అంతలోనే కదలి యెటకైన బోవు : నామనసు
నిల్పి కోర్కెలణచి వేవేగ బ్రోవుమా! ॥ఆలిం॥

3) ఎరుకా కెరటాలు నన్ను ఏయ్యరనియావు! భ్రాంతి
సర్పాలు ననుబట్టి కదలనియ్యవూ, ఏలీలగాతువో,
ఏరీతిబ్రోతువో భారమంతనీవెసుమా ప్రభురాయవినుమా

4) తల్లిదండ్రి దొరదాత దైవామునీవనీ, మదీలోన
నమ్ముకొని మరువక స్మరియింతు జననామరణం
లనే సుడిగుండమున జిక్కిశిర మొంచినాను దేవ
శరణు శరణంచునూ ॥ఆలిం॥

5) యీ పుణ్యభూమిలో నరసాపురంబులో
నిలచి భక్తుల బ్రోచు శ్రీరామచంద్రా సీతా
మహలక్ష్మి గూడి విజయలక్ష్మీ భ్రాంతి రహితంబు
చేయంచదె రక్షించి బ్రోవగదె ॥ఆలిం॥

# దేవా వందనం - సద్గురుదేవా వందనం

పల్లవి : దేవావందనం, సద్గురుదేవా వందనం దేవుదెవ్వడో తెల్పి
కొందమని దీక్షబూని యుపదేశమందగా! దేహీ
దేహములు
లేని బయలునే దేవుడంచు నెరిగించిన
॥సద్గురు దేవావందన॥

1) నేనుయెవ్వరో నెచటనుంటినో ఎందుకొస్తినో యేడ
బోదునో శరణు శరణు మీ చరణము విడువను స్వామీ
దెల్పుమా ॥దేవా॥

2) బిడ్డా లెమ్మిక నీకడ్డూ లేధిక - పట్టు వీడకూ భక్తి
మానకూ అన్ని యునీకే అర్ధమవుతవి అంతరంగమున
నిష్టచేసుకో ॥బిడ్డా॥

3) దేహి నిత్యమూ, దేహమ నిత్యము దేహియైన మరినేనే
బ్రహ్మము అనే నేనెరిగినదంత భ్రాంతియని యెగురగొట్ట
గా నేమిచెతునో ॥దేవా॥

4) మూలమూ యేదిరా - బైలులో స్థానము లేదురా నీవె
మూలమూ నీవె స్థానమూ అన్నియునీవే ఆత్మవునీవే
నీలోనీవె పరిభ్రమింతువు ॥బిడ్డా॥

5) అన్నీ నేనని అంటిరిగాదా అంతలో నేనని అంటిరిగాదా
బయలు మాత్రమే నెందుకుగానో ప్రభువరదెల్పవె
పస్తుతిజేతును ॥దేవా॥

6) అన్ని నీవెలే - నీకుభిన్నంలేదులే నిన్ను బయలునా
నిలుపజూచితే సున్నె పోదువు చూచేనంతలో ॥బిడ్డా॥

7) అన్నీ యెరుగుదూ - కానినన్నే యెరుగనూ నన్ను
జూచితే అన్నియు తెలియును నన్ను నాకు జూపింపుము
మ్రొక్కెద ॥దేవా॥

8) ఇదిగో ఆకసం బిల్లదిగో యాత్మరా! ఆత్మాకాశము
విడచి చూడరా అంతయు కలయైకల్లె పోవుర ॥బిడ్డా॥

## ఓదయామయా

(కీర్తన)

1) ఏదయామయా సదమల హృదయా
శ్రీ సదానందా ..... హేరామచంద్రా ॥ఓ॥

2) ఏ పూర్వపుణ్య విశేష భాగ్యమో
నీ పాదరేణువై నిలచేను స్వామి

ధర్మమొసగి మా కర్మము బాపి
జననమరణ వ్యధ దీర్చు మయా ॥ఓ॥

3) జ్ఞానమెలేని అజ్ఞాన తిమిరమున
అడుగడుగున నే తడబడుదునయా
జ్ఞాననేత్రమే తెరిపించే నాలో
సుజ్ఞాన దీపమే వెలిగించు మయా ॥ఓ॥

4) అయోధ్య నేలే ఆరామచంద్రుడే, యీరామ
చంద్రుడై యిట నవతరించే
చిరునవ్వు లొలికే చిరుదరహాసం
పరమ పవిత్రం నీనామరూపం ॥ఓ॥

5) శ్రీరాజేంద్రుని చరణము బట్టి
స్థితప్రజ్ఞ లక్షణ యుతుడై నావు
నీ పాదము పట్టే యీరాధ జన్మ
భ్రాంతి రహిత మిదె జేయుమయా ॥ఓ॥

# మాతాస్తుతి

(సహస్ర కుంకుమార్చనానంతరం)

పల్లవి : దేవీభవానీ దివ్య స్వరూపిణి
దీనజనా పరిపాలినీ ॥దేవీ॥

1) ఘల్లుఘల్లున పాద గజ్జెలందెలు మ్రోయ
వేగరావేలా కొలువుకు వేళాయె
మేలైనబోధతో మేలుకొల్పవే
కనికరించవే కామితదాయినీ ॥దేవీ॥

2) కలువ రేకులవంటి కన్నుల నుండినీ
కరుణ చిలుకవే కాత్యాయనీ
చిగురుటాకులవంటి పదముల వ్రాలితి
చేరదీసి నా సేద దీర్చవే ॥దేవీ॥

3) పరమ దయాకరి హిమగిరి తనయే
పరమ శివుని సగభాగమైతివే
చిన్నారి తల్లివే నన్నేల నిపుడే
కనులుచల్లగ చేస్తు కదలీరావమ్మా ॥దేవీ॥

4) సిరులకు లక్ష్మివే సీతమహలక్ష్మివే
శ్రీరామచంద్రునీ చేర బుట్టితివే
అతని విడచీముందె అదృశ్యమగుటకు
యెటుల నొప్పె నీ కోమల హృదయము ॥దేవీ॥

5) ఆదిఅంతమూలేని అమ్మవు నీవమ్మా
సకల చరాచర ప్రకృతి వీవే
జగముల వెలగే జగదాంబ వీవే
రాదా హృదయ నివాసి నీవే ॥దేవీ॥

